25-12-1992

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



వినడానికి విచిత్రంగా
వున్నా రాజధానిలో
జోరుగా షికారు
చేస్తున్న పుకారు

# కోట్ల రాజీనామా?

కోట్ల విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రి పదవి వదులుకొని తిరిగి ఢిల్లీ వెళ్తారా? ప్రస్తుతం రాజధానిలో ఈ విషయమై జోరుగా చర్చలు జరుగుతున్నాయి. అసెంబ్లీ లాబీలో అయితే ఎమ్మెల్యేలు దీన్ని గురించి మాట్లాడుకోని రోజులేదు.

లోక్‌సభ సభ్యత్వ రాజీనామాకు సిద్ధపడిన కోట్లను 'రాజీనామా చేయవద్దని' ప్రధాని పి.వి. నరసింహారావు వారించినట్లు వార్త రావడంతో ముఖ్యమంత్రి ఢిల్లీ పయనంపై ఊహాగానాలు మొదలయ్యాయి.

బాబ్రీ మసీద్ కూలగొట్టిన తర్వాత కేంద్రంలో ముఖ్యంగా కాంగ్రెస్‌లో తలెత్తిన రాజకీయ పరిణామాల దృష్ట్యా 'కోట్ల'వంటి సీనియర్ నాయకుడి అండదండలు తనకు అవసరమని పి.వి. భావిస్తున్నారట. తన పీఠానికి అర్జున్‌సింగ్ ఎసరు పెట్టబోతున్న తరుణంలో ... [sic] పొగబెట్టడాన్ని కోట్ల తీవ్రంగా వ్యతిరేకించటమే గాక, తన పదవిని వదిలించేసేందుకు శాయశక్తుల కృషి చేయడం పట్ల పి.వి. ముగ్ధుడైయున్నట్లు ఢిల్లీ వార్తలు తెలియజేస్తున్నాయి. సొంత గూట్లో సైతం రాజకీయాలు సంక్షోభ దిశలో వున్న ఈ తరుణంలో 'ఏకాకి'గా మిగిలిన తనకు గట్టితోడు అవసరమని భావించడం వల్లనే కోట్ల రాజీనామాకు పివి "నో" అన్నట్లు తెలుస్తోంది. దీంట్లో నిజానిజాలు ఎలావున్నా కోట్ల ఢిల్లీకి వెళ్తారని రాజధానిలో జోరుగా పుకార్లు షికారు చేస్తున్నాయి. రాష్ట్ర ముఖ్యమంత్రి అయ్యేందుకు వీలుగా కేంద్రమంత్రి పదవికి కోట్ల రాజీనామా చేశారు. అయితే లోక్‌సభ సభ్యత్వానికి మాత్రం రాజీనామా చేయలేదు. ముఖ్యమంత్రిగా వున్న తాను ఇంకా లోక్‌సభ సభ్యుడిగా కొనసాగడంలో అర్థంలేదని కోట్ల రాజీనామాకు సిద్ధమైనట్లు ఆయన సన్నిహిత వర్గాల కథనం. పి.వి. కోరిక మేరకు 'రాజీనామా' నిర్ణయాన్ని కోట్ల వాయిదా వేసుకోవడంలో గల ఆంతర్యాన్ని మాత్రం ఆ వర్గాలు వెల్లడించటం లేదు.

## ఐఎఎస్‌ల సహాయ నిరాకరణ?

## ముదురుతున్న ఐఎఎస్‌ల గొడవ

ఐఎఎస్ ల బదిలీలతో కోట్ల వివాదాన్ని కొనితెచ్చుకున్నారు. ఈ నెల 16 తేదీన జరిగిన ఐఎఎస్‌ల సంఘ సమావేశంలో అధికారులు రెండు వర్గాలుగా చీలిపోయారు. ఒక వర్గం సిఎం నిర్ణయాలను సమర్థించగా, మరో వర్గం సిఎం కు వ్యతిరేకంగా తయారైంది. సీనియర్ ఐఎఎస్ ల పట్ల ముఖ్యమంత్రి పనిగట్టుకొని కక్షసాధింపు ధోరణితో వ్యవహరిస్తున్నారని వ్యతిరేక వర్గం విరుచుక పడింది. ఒక భూమికి సంబంధించిన కేసులో సంతానం, వళియప్పన్‌లు ఇరువురిపై ఆరోపణలుండగా కేవలం సంతానంకు మాత్రమే ప్రభుత్వం నోటీస్ జారీ చేసింది. ఈ నెలాఖరులో పదవీ విరమణ చేస్తున్న అరోరా స్థానంలో ప్రధాన కార్యదర్శి కావల్సివున్న సంతానం ప్రమోషన్ అవకాశాల్ని దెబ్బతీసేందుకే ముఖ్యమంత్రి ఉద్దేశ్యపూర్వకంగా నోటీస్ ఇప్పించారని వ్యతిరేక వర్గం ఆరోపిస్తున్నది. ముఖ్యమంత్రి తన ధోరణిని మార్చుకోనంతకాలం ప్రభుత్వానికి సహకరించరాదని కొందరు అధికారులు పట్టుబట్టడంతో ఈ వివాదం తారస్థాయికి చేరుకుంది.

## సారాపై తాత్సారం

సారాపై నిర్ణయం తీసుకోవడంలో ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి తాత్సారం చేయడం కాంగ్రెస్ వారికే నచ్చుటం లేదు. రాష్ట్ర వ్యాప్తంగా ఊపందుకున్న సారా వ్యతిరేక ఉద్యమం

కొరవ 8 పేజీలో



# అయోధ్య దారుణం

1) తలచిన కార్యం పరిపూర్ణంగా నెరవేరిందన్న సంతోషాతిశయంతో వడలుమరచి కేరింతలు కొడుతున్న సాధువులు

2) మసీదు కూల్చివేతకు రిహార్సల్‌గా మట్టి పెళ్లలు పెకలిస్తున్న దృశ్యం

3) పలుగు, పారలే అస్త్రశస్త్రాలుగా విధ్వంసానికి బారులు తీరుతున్న కరసైనికులు

4) ఉన్మాదం ఆవహించి విధ్వంసానికి ఉరకలు వేస్తూ బ్యారికేడ్లపై నుంచి చెంగున దూకుతున్న కరసేవక [illegible]







# సెక్యులర్ శక్తులను ఏకం చేసిన అయోధ్య

తన కళ్లముందే మతప్రాతిపదికపైన దేశం ముక్కలు కావడం చూస్తూ విలపించడం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయతతో తనువు చాలించారు మహాత్మాగాంధీ. యాభైఏళ్ల తర్వాత చరిత్ర పునరావృతమౌతున్నది. అప్పుడు కూలిపోతున్న మహా వటవృక్షాన్ని తన బక్క ప్రాణం అడ్డం పెట్టి నిలబెట్టడానికి ప్రయత్నించనైనా మహాత్ముడున్నారు ;అయోధ్యలో కూలిపోయిన మత సామరస్య భావనల భవంతిని నిలపడానికి చేతులడ్డు పెట్టేవారెవరూ లేరినారు. - ఆ రాళ్ల రప్పలతో తమ రాజకీయ సౌధాలు నిర్మించుకోవడానికి తాపత్రయ పడేవారు తప్ప! ఆనాడు గాంధీ వెనుకే మేరుపర్వతం వంటి నెహ్రూ ముందుకొచ్చి సెక్యులర్ భావ బీజాలు నాటి, మహా మెళుకువతో పెంచి, పోషించారు; ఇప్పుడు ఎవరున్నారటువంటి తోటమాలులు? కూలిన చెట్టుకొమ్మలను తెగనరికి ఓట్ల చలిమంటలు కాచుకో జూచేవారు తప్ప!

ప్రధాని పివి నరసింహారావు తన హయాంలో దేశం అధోగతికి దిగజారి పోయిందన్న నిందను తప్పించుకోవడానికి శతవిధాల ప్రయత్నిస్తున్నారు. ముసలి ప్రాణాన్ని కష్టపెట్టి, సెక్యులర్ శక్తులను ఏకం చేయడానికి శ్రమిస్తున్నారు. అయోధ్య దుర్ఘటన ఆయనలో ఎక్కడలేని తెగింపును తెచ్చింది. పంటి బిగువున, కొండను ఢీకొనే పొట్టేలు మాదిరి బిజెపిపై రణభేరి మ్రోగిస్తున్నారు. ఈ పోరు ఒక్క బిజెపిపై కాదు- భారతీయతకే కళంకం తెస్తున్న హిందుత్వ మూఢభావాలపైన జరుగుతున్నది. అందువల్లే ఆయన అమ్ములపొదిలోని సామరస్య శస్త్రాలు గాంధేయతత్వపాశుపతాస్త్రం ముందు పూచిక పుల్ల బాణాల మాదిరి నిరుపయోగమై పోయాయి. తానూ మారణాస్త్రాలుతీయక తప్పడంలేదు. కరసేవ కల్లోలం ముగియగానే ఈ సంధి పరిస్థితిలో పివి ఒంటరివాడుగా, పద్మవ్యూహంలో చిక్కిన అభిమన్యుడిగా కన్పించాడు. కాని రోజులు గడిచే కొద్దీ ఆ ఒంటరి తనం మాయమౌతున్నది. నుదుట బొట్టు పెట్టి బాబాల కాళ్లకు మ్రొక్కే ఈ సద్బ్రాహ్మణుడు నిజంగా చిత్తశుద్ధితో మత రక్కసిని ప్రతిఘటించ జూస్తున్నారా అని సందేహించిన సెక్యులర్ శక్తులు ఒకటొకటిగా పివి పక్షంచేరి, సంఘటిత సమరానికి సన్నద్ధమౌతున్నాయి. తమ తమ వ్యక్తిగత స్వార్థాన్ని, రాజకీయ ప్రయోజనాన్ని నెరవేర్చుకునే సంకల్పం మనసులోవుంటే వుండవచ్చుగాక- సిపిఎం, సిపిఐ, జనతాదళ్ వంటి పార్టీలు సంక్షోభ సమయంలో సెక్యులర్ వాదనలకు సంఘీభావం ప్రకటించడం నిజంగా సంతోషించ దగిన పరిణామం. పార్లమెంట్‌లో బిజెపి ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానాన్ని పెద్దమెజారిటీతో ఓడించడం ద్వారా బిజెపిని ఒంటరిని చేశారు. మతతత్వ వాదులందరికి ఇదొక హెచ్చరికగా పరిగణించాలి! శత్రువును ఎదుర్కోవడానికి కౌరవ, పాండవులు నూటైదుగురుగా కలిసినట్లున్న ఈ కలయిక పటిష్ఠత పైనే దేశ భవితవ్యం ఆధారపడివుంది. కాని దేశం సంక్షోభంలో

# జమీన్‌రైతు

## ఇదా రాజకీయం?

రాష్ట్ర శాసన సభలో కాంగ్రెస్ తెలుగుదేశం మధ్య జరుగుతున్న వ్యక్తిగత ఆరోపణల యుద్ధం మరీ శృతి మించి పోతూంది. ఒకరిపై ఒకరు అభాండాలు వేయడం ద్వారా, దూషించుకోవడం ద్వారా వారిపురూ శాసనసభను బ్లాక్‌మెయిల్ రాజకీయాలకు వేదికగా మార్చి వేస్తున్నారు 1983లో ఎన్టీఆర్ అధికారంలోకి వచ్చిన నాటి నుంచే ఈ చెడు సాంప్రదాయం ప్రారంభమైంది. ఈ పదేళ్ళ కాలంలో శాసనసభ సమావేశాల సమయంలో సగ భాగం పైగా వ్యక్తిగత విషయాలకే దుర్వినియోగమై పోయిందన్నా ఆశ్చర్యం లేదు. ఎప్పుడో ఒకసారి, ఏదో ఒక సందర్భంలో వ్యక్తిగత ఈర్ష్యాసూయలు, కక్షలు కార్పణ్యాలతో, వ్యక్తిగత దూషణలకు పాల్పడ్డారంటే సహించవచ్చు. కాని ప్రతి సమావేశంలో, ప్రతి రోజూ అదే ధ్యేయంగా ప్రవర్తిస్తే ప్రజలెట్లా సహించాలి? ఎందుకు సహించాలి? రాజకీయ నాయకులలో సచ్చీలత, నిజాయితీ, సౌజన్యత్వం, చిత్తశుద్ధి,నిష్పక్షపాత వైఖరి వంటి సద్గుణాలు ఎప్పుడో అదృశ్యమైపోయాయి. ప్రతి పార్టీ, ప్రతి నాయకుడు ఒక గురువింద గింజే. వెతికితే ప్రతి ఒక్కరి వెనుకా పుట్టలు పుట్టలుగా అవినీతి చెదలు ప్రత్యక్షమౌతుంది. రాజకీయ వ్యవస్థే ఒక గొంగడివలె తయారైవుంది. అందులో తింది తింటూ వెంట్రుక లేరడాన్ని చూపి ప్రజలను మభ్యపెట్టలేరు. అది రామకృష్ణ స్టూడియోల దుర్వినియోగం కాని, మల్లెల బాబ్జీ దుర్మరణంకాని, ప్రపంచ బ్యాంకు పనుల కేటాయింపు దుర్మార్గంకాని, థియేటర్ల దగ్ధంకేసు కాని, మరొకటి మరొకటి కాని రెండు పార్టీల నాయకులూ దోషులే. ఆ సంగతి ప్రజలకు బాగా తెలుసు. వీరు ఒకరినొకరు నిందించుకున్నంత మాత్రాన ప్రజలు కొత్తగా తెలుసుకొనేది, తెలుసుకోగల్గేది ఏమీ లేదు.

తమ సంకుచిత ప్రవర్తన వల్ల శాసన సభ ప్రతిష్ట మంటగలిసిపోతుందని, దాని మౌలిక లక్ష్యాలు నీరు గారిపోతున్నాయని రెండు పార్టీల నాయకులూ గ్రహించాలి. విలువైన శాసన సభ సమావేశ సమయం వ్యర్థమై ప్రజల ప్రయోజనాలకు విఘాతం కల్గుతున్నదన్న వాస్తవాన్ని తెలుసుకోవాలి. రెండు పార్టీల నాయకులూ ఆత్మపరిశీలన చేసుకుని ఇకనుంచైనా అసెంబ్లీలో విధానాలపై తప్ప, వ్యక్తుల విషయాలపై మాట్లాడమని, సమయం వృధా చేయమని ప్రమాణం చేయాలి. ఆ నియమానికి కట్టుబడి వుండాలి. ఇదే పరిస్థితి మరికొంత కాలం కొనసాగితే శాసనసభ పట్లనే ప్రజలలో చులకన భావం ఏర్పడుతుంది; విశ్వాసం సన్నగిల్లుతుంది.

## బుద్ధిమారదు

ఎన్టీఆర్ బుద్ధి ఎప్పటికీ మారదు. మారే అవకాశమూ లేదు. ఆయనలో ఆ ఉద్దేశ్యం వుంటే, అసెంబ్లీ సమావేశాలు ఎగ్గొట్టి సినిమా షూటింగ్‌లో మునిగి పోతారా? అయోధ్య పరిణామాలపై చర్చించ డానికి తక్షణం శాసన సభను సమావేశ పరచాలని ఆయన డిమాండ్ చేశారు. పత్రికా ప్రకటనలు చేశారు. గెలిచేశారు. తీరా సభ సమావేశమయ్యేసరికి అంతు లేకుండా పోయారు.ఆయనిప్పుడు సినిమా షూటింగ్‌లో బిజీగా వున్నారట. ఒకేసారి రెండు సినిమాలు నిర్మాణంలో వుండడంతో క్షణం విడుదల వున్నట్లు లేదు. సమావేశాలు ప్రారంభమైన తొలి రోజు వచ్చారు. అటెండెన్స్ వేసుకుని వెళ్ళిపోయారు. ఆ తర్వాత రెండు రోజులు ముఖం చూపించారు. అప్పటి నుంచి అసలే అదృశ్యమైపోయారు. వుండడానికి సిటీలోనే వుంటున్నారట. కాని రావడానికి తీరిక లేదట. ఎంత అన్యాయం? ఎన్టీఆర్ సాధారణ శాసన సభ్యుడు కాదు; ప్రతిపక్షనాయకుడు. ప్రభుత్వాన్ని ప్రతి విధాన నిర్ణయంపై నిలదీసి, తప్పొప్పులు సవరింపవలసినవాడు. అటువంటి బాధ్యతాయుత పదవిలో వున్న నాయకుడు శాసన సభ కంటే తన సినిమాలు, తన వ్యాపారమే ప్రధానమని భావించి సమావేశాలకు గైర్‌హాజరైతే ఇక ఎవరు ఆ బాధ్యత స్వీకరిస్తారు? ప్రభుత్వ నిర్ణయాలను ఎవరు ప్రస్తావిస్తారు? ప్రతిపక్ష నాయకుడికే సమావేశాలపట్ల ఆసక్తి, శ్రద్ధ లేకుంటే సాధారణ ఎమ్మెల్యేలు ఇక ఎంత మాత్రం అసెంబ్లీని పట్టించుకుంటారు? అసెంబ్లీ పట్ల గౌరవం లేని నాయకుడికి అసెంబ్లీ సభ్యుడుగా ఎన్నికలలో నిలబడే హక్కు కూడా వుండదు; ప్రభుత్వ పెత్తనాన్ని ఆశించే అర్హత వుండదు.

ఎన్టీఆర్ అధికారంలోకి వచ్చి నప్పటినుంచి శాసన సభ సమావేశాలు జరిగే కాలం తగ్గిపోయింది. చట్టబద్ధంగా జరపాల్సిన రోజులు లెక్కపెట్టి అంతటితో సరిపెట్టేయడం ఆయన అలవాటు. దాన్ని ఆ తర్వాత వచ్చిన కాంగ్రెస్ ముఖ్యమంత్రులు పుణికి పుచ్చుకున్నారు. ఇప్పుడు విజయభాస్కరరెడ్డి గారు ఆ ఆనవాయితీని తప్పించి శీతాకాలంలోనూ సమావేశాలు పెట్టారు. అసెంబ్లీని ఎదుర్కొనే ధైర్యం లేనందువల్లనే ముఖ్యమంత్రులు తప్పించుకునేవారు. ధైర్యం లేకపోవడమంటే తాము చేసిన తప్పులు బయట పడతాయన్న భయమే కారణం. విజయభాస్కరరెడ్డి ఆ సాహసం ప్రదర్శించినందుకు అభినందించాలి. !

# జమీన్‌రైతు

25-12-1942

8 పేజీలు 0-1-6

## నెల్లూరు ముచ్చట్లు

(విమర్శకుడు)

మున్సిపాలిటీ నామినేషన్లు:

1. రావుసాహెబ్ రావపూరి రామలింగం శెట్టి 2. రావుసాహెబ్ చుందూరు సుబ్బయ్యశెట్టి 3. పడలి రంగయ్య 4. రేబాల లక్ష్మీనరసారెడ్డి 5. పత్తిశ్రీరాములు శెట్టి6. సారంగపాణి7. అల్లాడి అన్నపూర్ణమ్మ8. సుబ్బరాయన్9. యం.యస్. రాఘవన్10. కాకుటూరు నరసింహా రావు11. అష్టకాల పట్టాభిరామయ్య12. మిషన్‌హైస్కూలు హెడ్‌మాస్టరు రాజ రాత్నం13. పిళ్ళసతి14. అబ్దుల్ సలాం15. మహబూబుఖాన్ 16. బెనారస్ హోల్ ఖా.సా. ఖాదరల్లీ17. సులే మన్ సాహెబ్18. ఖాజీఅన్సారి 19. పట్నం మీరాస్వామి20. పార్థ సారధి నాయుడు21. వేదాంతాచారి22. పున్నయ్య23. టి. సుబ్రహ్మణ్యమొదలి 24. పుచ్చలపల్లి అయ్యపరెడ్డి గార్లను నామినేట్ చేయవచ్చునని వూహ. చేర్‌మెన్ రేబాల రెడ్డిగారు , వైస్ చేర్‌మెన్ రావుసాహెబ్‌లలో ఒకరు వుండవచ్చు.

చక్కెరగోల

పేటలో మునిలశెట్టి అవక తవకజాస్తిగా వుంది. డబ్బుతీసుకుని పెట్టిలో వేసుకొని మరచిపోయి లేదంటున్నారనే కంప్లెయింట్లు గూడా వున్నాయి. టవునులోగాని, పేటలోగాని, చక్కెర సరిగా అన్వతం లేదని దృఢంగా చెప్పవచ్చును.

నెల్లూరు జిల్లా అరెస్టులు

ఓరుగంటి వెంకట సుబ్బయ్య గారు తన భార్య పక్షవాతంచేత బాధపడుతూ భర్తనుగూర్చి కలవరిస్తూ ఉన్మాదావస్థలో నున్నందున కొన్ని షరత్తులతో జైలునుండి 16 తేదిన వచ్చిరి. పాపం వీరు ఇంటికి వచ్చునప్పటికి పుత్రుడు వెంకటేశ్వర్లు కఠోర మరణవార్త గూడ వినవచ్చెను: దహనకాండ గూడా అయిపోయినందను శవాన్ని చూచే ప్రాప్తంగూడా లేకపోయింది.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

టవున్‌లో కలరా

| | |
|---|---|
| 20 తేదీ వరకు తగిలిన వారు | 46 |
| మరణించిన వారు | 25 |

మార్లగుంట కేసు

వెంకటగిరి తాలూకు మార్లగుంట రైటింగ్ కేసులో నెల్లూరు సెషన్సు జడ్జి పది మంది ముద్దాయిలలో నిడిగంటి వీరయ్య, శఖు పిచ్చయ్య గార్లకు ఉరి శిక్షయున్నూ, తక్కిన ఎనిమిది మందికి యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్ష యున్నూ విధించిరి.

మదరాసు హై కోర్టు అప్పీలు చేయగా తానంచెర్ల గురవయ్య అను వకరిని మాత్రం వదలి, తక్కిన అందరికీ క్రింది కోర్టు తీర్పును 15 తేది ఖాయం చేసిరి.

హిందూ - మహమ్మదీయ గలాటా కేసు

గత హిందూ- మహమ్మదీయు గలాటాలో పగీలు ముత్తరాజా శ్రీనివాసరావు గారిని కత్తితో పొడిచినాడని పామూరు పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు అబ్దుల్ ఖాదరుగారి తమ్ముడు భాషామీద కేసు బెట్టిరి. నెల్లూరు సెషన్సు జడ్జి ముద్దాయికి యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్ష విధించిరి. హైకోర్టులో అప్పీలు చేయగా 14 తేది క్రింది కోర్టు తీర్పునే ఖాయంజేసిరి.

* * *

వెంకటగిరి సబ్‌ఇన్‌స్పెక్టరు అరెస్టు

హరిజనయువతిని అరెస్టు జేసి లాకప్‌లో ఆ రాత్రి నిర్బంధించారన్న కేసులో సబ్‌యిన్‌స్పెక్టరు బెంజిమెన్ . రైటరు మనోహరం గార్లను సర్కిల్ యిన్‌స్పెక్టరు 21తేది అరెస్టుచేసి గూడూరు సబ్ మేజిస్ట్రేటు కోర్టులో హాజరు పెట్టగా బెయిల్ మీద విడుదల చేసిరి.

కొరవ 11 పేజీలో

## జోషిని దేశద్రోహి అనకండి !

డిసెంబర్ 11తేది నాటి 'జమీన్‌రైతు' సంచికలో అయోధ్య పరిణామాలను ప్రస్తావిస్తూ బి.జె.పి. జాతీయ అధ్యక్షులు శ్రీ మురళీ మనోహర్ జోషి ఫోటో క్రింద దేశద్రోహి అనతగ్గ వ్యక్తిగా అభివర్ణించారుఆఆయనపై అటువంటి వ్యాఖ్య చేయడం అన్యాయం, అక్రమమని సవినయంగా మనవి చేస్తున్నాను. అయోధ్య సంఘటనలు మీ దృష్టిలో తప్పైతే బిజెపి , విహెచ్‌పి , ఆర్‌ఎస్ఎస్, భజరంగదళ్, శివసేనలపై దుమ్మెత్తి పోస్తూ రాసుకోండి. జోషిని మాత్రం దేశద్రోహి అనకండి. ఆర్‌ఎస్ఎస్ కార్యకర్తల నరనరాల్లో దేశభక్తి జీర్ణించుకొనివుంటుంది. "నమస్తే సదావత్సలే మాతృభూమే" అని ధ్యానించనిదే, భరతమాత పతాకానికి ప్రణామం చేయనిదే వారు ఏ పనీ చేయరు. అటువంటి సంస్థనుండి వచ్చిన వ్యక్తి జోషి. ఈ విషయం మీకు తెలియక పోవడం శోచనీయం. భరత మాత దాస్యశృంఖలాలను ఛేదించను త్యాగాలు చేసిన వినాయక దామోదర సావర్కర్, డాక్టర్ కేశవబలరాం, హెడ్గేవార్, సదాశివ గోల్‌వర్కర్, శ్యాంప్రసాద్ ముఖర్జీ, అజాద్ చంద్రశేఖర్, భగత్‌సింగ్ ఆశయాలనుండి పుట్టినదే ఆర్‌ఎస్ఎస్ అని గుర్తుకు తెస్తున్నాను.

- ఆర్.కె. విశ్వనాథం

నెల్లూరు

### అప్రయోజకత్వం

పార్టీల పరంగా, సంస్థల పరంగా ద్వేషముండవచ్చుగాని మతం పట్ల వుండడం క్షేమకరం కాదు. బాబర్ చక్రవర్తి దేవుడు కాదు, అతనో మతోన్మాది. ఆ రోజుల్లో తన చేతుల్లో బలముండడంవల్ల

### జనవాణి

ఎన్నో దేవాలయాలను నిర్మూలించాడు. ప్రస్తుతం లౌకికతత్వ సిద్ధాంతాలపై సమాజం నడుస్తున్న సమయంలో ఈ నెల 6 తేది జరిగిన 'అయోధ్య విధ్వంసకాండ మాయని మచ్చే'. ఈ పని బలహీనమైన వాడిని 'బలి' లోకి పంపి 'నేనే గెల్చానని' చెప్పుకున్నట్టుంది. సమస్య తక్షణ పరిష్కార మార్గాలు ఆలోచించడంలో ప్రభుత్వం విఫలమవడంతోపాటు దాని అప్రయోజకత్వం బయట పడిందని చెప్పవచ్చు.

- షేక్. ఇమాముద్దీన్

ఎ.ఎస్.పేట.

### శాంతియుత సహజీవనానికి అడ్డంకి

దేశంలో శాంతియుత సహజీవనానికి అయోధ్య సంఘటనలు

కొరవ 11 పేజీలో

**'ఆధునిక సేద్యాన్ని' అపహాస్యం చేస్తూ, ఎరువులు మందులు అసలే వాడకుండా అత్యధిక దిగుబడితో పంటలు పండిస్తున్న కర్ణాటక రైతు కథ వినండి!**

# ప్రకృతికి నష్టం కల్గించని ప్రకృతి సిద్ధ సేద్యం!

**డాక్టర్ సిద్దారెడ్డి ఈశ్వరరెడ్డి**

పంటలను మూడు పద్ధతుల్లో పండించవచ్చు. 1. సాంప్రదాయబద్ధంగా 2. రసాయనికంగా, 3. సహజంగా. అయితే ఒక్కోపద్ధతి తనదైన బాణీలో నేలపై ప్రభావం చూపుతుంది.

సాంప్రదాయ వ్యవసాయంలో నేలను అదనులో దున్నడం, పంటలను మార్పిడి చేసి సాగుచేయటం, అదునులోనే పంటలను నాటడం జరుగుతుంది. అంతే గాక తగిన మోతాదులో సేంద్రియ ఎరువును వాడడం వల్ల పంటల దిగుబడి తగ్గదు. నేల సారవంతమవుతూ ఉంటుంది. ఒక పంట తరువాత నేలకు కొత్త విశ్రాంతి లభిస్తుంది కనుక నేల సారాన్ని తిరిగి పుంజుకుంటుంది.

రసాయనిక వ్యవసాయంలో, అధిక మోతాదుల్లో రసాయనిక ఎరువులను వాడతారు. ఇవి త్వరితంగా మొక్కకు అందుతాయి. అంతే గాక ఏదో ఒక రసాయనిక కీటక నాశనుల్ని, తెగులు నివారణ రసాయనిక మందుల్ని పంటపై అధిక మోతాదుల్లో చల్లుతుంటారు. ఒకసారి ఒక మోతాదులో చల్లితే కొంత కాలానికి, పురుగులు ఆ మోతాదుకు అలవాటు పడతాయి. కనుక మందు ప్రభావం ఉండదు. అందువల్ల మందును మార్చడమో, ఎక్కువ మోతాదులో కొట్టడమో చేస్తుంటారు. పురుగు మందుల కంపెనీలు ప్రత్యేకించి బహుళ జాతి సంస్థలైతే అభివృద్ధి చెందిన దేశాల్లో నిషేధించిన పురుగు మందులను అభివృద్ధి చెందుతున్న దేశాల్లో అమ్ముకోవటం పరిపాటి.

పై కారణాల వల్ల నేల, జీవాన్ని కోల్పోతుంది. సహజంగా ఉన్న సారాన్ని త్వరితంగా నష్టపోతుంది. పర్యావరణంలో అనేక చెడ్డమార్పులు వస్తాయి.

సహజ సిద్ధమైన వ్యవసాయం, సాంప్రదాయ వ్యవసాయం కంటే ఒకడుగు ముందుకు వేసి" ఏమీ చెయ్యొద్దు "అనే సిద్ధాంతాన్ని ప్రబోధిస్తుంది. సోమరి పోతులు దీన్ని అసలు సేద్యం చేసేపనే లేదు అనే అర్థంలో తీసుకొని ప్రకృతే అంతా చేస్తుంది అంటే తప్పు. జపాను తాత్వికుడు ఫ్యుకోకా తన రచన "దివన్‌స్ట్రా రివెల్యూషన్" లో సులభమైన సేద్య విధానం, అందులోనూ సహజ వాతావరణంలో చేయడాన్ని సమాజానికి గుర్తుచేస్తాడు. నవీన సాంకేతిక పద్ధతుల ద్వారా రసాయనాలను అధిక మోతాదుల్లో వాడి పర్యావరణంలో మార్పులు తెచ్చి, మనుషుల మనుగడకు ఇతర ప్రాణికోటికి నష్టం కల్గించవద్దంటాడు. సహజ సిద్ధమైన సేద్యం అంటే ఫ్యుకోకా దృష్టిలో వ్యవసాయం పెద్ద యాంత్రిక కమతాలనుంచి, జీవముండే చిన్న ఫారాలకు మారాలి. అప్పుడు వ్యవసాయం అంటే పంటలను పండించడమే గాదు మనుషులను గూడ సాగుచేయడం, అదీ గూడ ప్రకృతితో బాటు కలసి మెలసి వుండాలి.

ఆ బాటలో ఇప్పుడు ప్రపంచంలో అనేక ప్రాంతాల్లో సహజసిద్ధమైన వ్యవసాయ విధానం వైపు చాలమంది మొగ్గుచూపుతున్నారు.

ప్రస్తుత కాలంలో ఈ మాటలు చెబితే ఎదురుగానే నవ్వి పోతారు ఎందుకంటే భారతీయ పంటల విప్లవానికి హరిత విప్లవం మూలం. సంకర విత్తనాలు వ్యవసాయ యంత్రాలు, అధిక మోతాదుల్లో రసాయనిక ఎరువులు, వీటితో బాటు చీడ పీడల మందులు అని మనం అనుకుంటున్నాము. ఆ విధంగానే రైతులు పోటీలు పడి అవసరానికి, శక్తికి మించి చీడ పీడల మందులు పంటలపై చల్లడానికి అలవాటు పడ్డారు.

అటువంటి వాళ్లు ఒక్కసారి బెంగుళూరు దగ్గరలో అంటే 25కి.మీ దూరంలో ఉన్న సొరహున్సి గ్రామానికి వెళ్ళి, అక్కడున్న 53 సంవత్సరాల రైతు శ్రీ యల్.నారాయణరెడ్డిగారి సేద్యం చూస్తేచాలు. గత పదిసంవత్సరాలుగా రెడ్డిగారు రసాయనిక ఎరువులను, పురుగు మందులను వాడటం లేదు. వ్యవసాయ శాస్త్రవేత్తలు ఉద్బోధించే ఇతర ఆధునిక పద్ధతుల్ని పాటించడంలేదు. అయితే ఆయన 7 1/2 ఎకరాల్లోని దిగుబడి, శాస్త్రీయ పద్ధతుల్లో సాగుచేసే ఇతర ఏ పొలానికి తీసిపోవడంలేదు. ఇంకా చెప్పాలంటే నారాయణ రెడ్డిగారు ఈ దిగుబడిని తక్కువ ఖర్చుతో, పర్యావరణానికి నష్టం కల్గించకుండా సాధించారు.

కొస్త గతంలోకి వెళ్తే నారాయణ రెడ్డిగారు ప్రకృతి అందాల్ని ఆస్వాదిస్తూ, సాంప్రదాయ బద్ధంగా చేసే కాలిఫోర్నియా పద్ధతుల్నో లేక జపాను దేశ తాత్వికుడు "మాన్‌సనోబు ఫ్యుకోకా" చెప్పే సహజ సిద్ధ వ్యవసాయ పద్ధతుల్నో ఒంట పట్టించుకోలేదు. చాలా పెద్ద మామూలు వ్యవసాయ కుటుంబంలో పుట్టాడు- అదీ పదిహేనవ బిడ్డగా! బలహీనంగా ఉండడంతో, వ్యవసాయ పనులు చేయలేడనే ఉద్దేశ్యంతో బడికి పంపారు. " నా అన్న పెళ్ళి రోజున నన్ను బడిలో తోశారు" అని నవ్వుతూ చెబుతారు రెడ్డిగారు. అక్కడా హైస్కూలు దాట లేదు. కుప్పల దగ్గర గొడవల్తో ఇల్లువదిలి వెళ్ళిన నారాయణ రెడ్డిగారు బెంగుళూరులో చిన్న చిన్న పనులు చేసి పొట్టపోసుకున్నారు. తనపెళ్ళితో తిరిగి ఊరు చేరి వాళ్ళ నాయన మిగిల్చిన రెండు ఎకరాలను స్వాధీనం చేసుకున్నారు. అది బహుశా 70వ దశకం మధ్యకాలం. వ్యవసాయ విస్తరణ అధికారుల బోధనలతో రెడ్డిగారు తన పొలాన్ని పూర్తిగా శాస్త్రీయ పద్ధతుల్లో సాగుచేశారు. ట్రాక్టరును అద్దెకు తీసుకొని అధిక మోతాదుల్లోరసాయనిక ఎరువులను వేసి రైదులు, నువ్వులు, అలసంద పండించారు. ఆయనపడ్డ కష్టం అనుకున్న ఫలితాన్ని ఇచ్చింది. 1978 లో రైదుల్లో అధిక దిగుబడి అంటే ఎకరాకి 23 క్వింటాళ్ళు పొందినందుకు రాష్ట్ర ప్రభుత్వ బహుమతిని అందుకున్నారు. అయితే రెడ్డిగారు అంటారు" ఒక సాయంకాలం నేను తీరుబడిగా కూర్చుని జమా ఖర్చులు చూస్తే నేను నిజంగా నష్టాల్లో ఉన్నానని తెలిసింది".

లాభానికి, పెట్టిన ఖర్చుకు, వచ్చిన దిగుబడికి ఏమాత్రం పొంతన లేక దిగులు పడుతున్న ఆరోజుల్లో రెడ్డిగారు శ్రీసత్యసాయిబాబా భక్తుడైన అమెరికా వాసి ఆల్విన్ డ్రకర్‌ను కలవడం జరిగింది. డ్రకర్ ద్వారా ఫ్యుకోకా రచనల గురించి సహజ వ్యవసాయ సూత్రాల్ని గురించి నారాయణరెడ్డి తెలుసుకున్నారు.

అంతే, ఒక్కసారి సహజ వ్యవసాయం వైపు దూకారు. మార్పుకాలం చాలా కష్టంగా ఉండింది అంటారు శ్రీ రెడ్డి. దిగుబడులు 23 క్వింటాళ్ళ నుంచి 7 క్వింటాళ్ళకు పడిపోయాయి. చాలా నష్టపడ్డారు. అయితే డ్రకర్ కొస్త ఓపిక పట్టమని 5000 రూపాయలు అప్పుగా కూడా ఇచ్చాడట.

తప్పుల్నుంచి పాఠాలు నేర్చుకొన్నారట. నేలను ఎక్కువ సార్లు దున్నితే , నేల రేణువులుముక్కలై, సూక్ష్మక్రిముల వ్యాపకాన్ని

కాలం 10 పేజీలో



స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నెల్లూరు బ్రాంచి కంకరెంట్ ఆడిటరుగా పదవి విరమణ చేసిన పోకల పాండు రంగారావును సన్మానిస్తున్నసిబ్బంది సంఘం జేనల్ కార్యదర్శి వెంకటేశ్వర రావు

## ఆంధ్రప్రశస్తి- క్షంతవ్యంకాని అపరాధం!

11.12.92 జమీన్‌రైతు లో రెండు విషయాలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. మొదటిది 'తిక్కన రొక్కం కవా' అనే శ్రీ తిరుమూరు సుధాకర్ రెడ్డి గారి వేదన; రెండవది 'జమీన్‌రైతు సాహిత్య సేవ చేయలేదా' అనే శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం గారి ఆవేదన.

తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన 'ఆంధ్రప్రశస్తి' కవితా సంకలనంలో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి పద్యంగా ప్రచురింపబడ్డ 'తిక్కన భారత కృతికై...' అనే పద్యాన్ని శ్రీ సుధాకర్ రెడ్డి ఉదాహరించారు. ధనం కోసం తిక్కన భారతం వ్రాసి మనుమసిద్ధికి కృతినిచ్చారని ఆ పద్య భావం. 'ఆంధ్రప్రశస్తి' కవితా సంకలనం నేను చూడలేదు. కాని ఆ పద్యం విశ్వనాథ వారిదిగా పేర్కొనడం కవిసామ్రాట్టుకు అపఖ్యాతిని ఆపాదించడమే కొతుంది. విశ్వనాథ వారు తిక్కన భారతాన్ని చదవలేదు అని మనం భావించగలమా? తిక్కన తన కృతిని హరిహరనాథునికి అంకిత మిచ్చిన విషయం విశ్వనాథ వారికి తెలియదని మనం అనుకోవాలా? అసలు భారతం వ్రాసి వారికి మనుమసిద్ధి గతించాడన్న విషయం; తిక్కన యజ్ఞం చేసి సోమయాజియైన తర్వాత భారతం వ్రాశాడన్న విషయం విశ్వనాథ వారికి తెలియదా? లేక 'ఆంధ్రప్రశస్తి' సంకలన కర్తకు తెలియదా? ఏ అనామకుడో వ్రాసిన సందర్భ శుద్ధిలేని పద్యాన్ని విశ్వనాథ వారిదిగా పేర్కొనడం క్షంతవ్యం కాని అపరాధం; ప్రాయశ్చిత్తం లేని మహా పాపం. తెలుగు యూనివర్సిటీ వారు ఈ పొరబాటును సరిదిద్దగలరని ఆశిస్తున్నాను.

ఇక 'తెలుగు పత్రికల సాహిత్య సేవ' లో జమీన్‌రైతు చేసిన సాహిత్య సేవను గురించి డాక్టర్ తిరుమల రామచంద్ర గారు వివరించక పోవడం బాధాకరమైన విషయం. బహుశః జమీన్‌రైతు పత్రికలను వారెప్పుడూ చూడలేదేమో. లేక 'ప్రమాదో ధీమతామపి' అనుకోనవలెనేమో. సాహిత్య పరిశోధకుల కెందరికో జమీన్‌రైతు భిక్ష పెట్టిందన్న విషయం డాక్టర్ రామచంద్ర గారు గుర్తుంచుకొని జరిగిన పొరబాటును సవరించగలరని ఆశిస్తున్నాను.

**డాక్టర్ జెవి సుబ్బరాయుడు**

# రోడ్లు పాడు కావడానికి మునిసిపాలిటీయే కారణం!

**ఒక ఆర్ అండ్ బి ఇంజనీరు ఆవేదన**

**సింహపురి**

మొన్న కురిసిన వానలకు తీన్నారై పోయిన నెల్లూరు ప్రధాన రోడ్ల పరిస్థితిని గురించి పత్రికలలో వస్తున్న విమర్శల పట్ల ఒక అర్‌అండ్‌బి ఇంజనీరు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. పత్రికలు వ్రాస్తున్నట్లు తాము రోడ్డు సొమ్మును దిగమింగి రోడ్లను పాడుబెట్టడం లేదనేది ఆయన వేదన. నెల్లూరు రోడ్డు అంత త్వరితంగా పాడైపోవడానికి మునిసిపాలిటీయే కారణమన్నది ఆయన వాదం. ఆయనేమి చెప్తున్నారో వినండి-

పెద్దాస్పత్రి నుంచి ఆత్మకూరు బస్టాండు వరకు గ్రాండ్ ట్రంకురోడ్డు మహా గ్రాండ్‌గా గుంటలు పడిపోయింది. ఒకటి రెండు దగ్గర్ల కాదు – మొత్తం 6 కిలో మీటర్ల దూరమూ రూపం కోల్పోయింది. ఎవరికైనా వెంటనే స్ఫురించేది నాణ్యత లోపం; ఎవరైనా వెంటనే తిట్టేది రోడ్డు వేసిన అర్‌అండ్‌బి శాఖను ! కాని కారణం అది కాదు. ఆ నేరం మునిసిపాలిటీది. నెల్లూరు టౌన్‌లోని ఏ ప్రధాన రోడ్డుకూ డ్రైనేజీ లేదు. రోడ్డుకు రెండు ప్రక్కలా ఇళ్లున్నాయి. రోడ్డు మార్జిన్లను వారు ఆక్రమించేసి, రోడ్డు కంటే ఎత్తు చేస్తున్నారు. ఇళ్లలోని నీరంతా రోడ్లోకి వచ్చి, ఒక కాలువ వలె మారిపోతూంది. ఆ నీటి ప్రవాహానికి కంకర లేచిపోతున్నది. రోడ్డుకు రెండు వైపులా డ్రైన్లు కట్టమని మునిసిపాలిటీని ఇప్పటికి ఏ వంద సార్లో అడిగాము. కాని సమాధానం లేదు. డ్రైన్లు కడితే మార్జిన్లు మిగుల్తాయి. రు డ్రైనేలాను, మార్జిన్ల...

కాలం 10 పేజీలో

# నిండలిలో తుపాకి పేల్చినా లెక్కించక దోచుకున్నారు!

## మళ్లీ జిల్లాను హడలెత్తిస్తున్న దోపిడీలు

డిసెంబర్ నెల మొదటి వారం నెల్లూరు జిల్లాలో బందిపోటు దొంగతనాలు తగ్గు ముఖం పట్టాయని భావిస్తున్న తరుణంలో బాలాయపల్లి మండలం నిండలి గ్రామంలో సోమవారం జరిగిన దోపిడి ప్రజలలో భయోత్పాతం సృష్టించింది. ఏకంగా 20 మంది బందిపోట్లు మూడు గంటల పాటు నాలుగిళ్ల పై బడి బీభత్సం సృష్టించి లక్ష రూపాయలకు పైగా డబ్బు, నగలు, దోచుకుపోయారు. అడ్డొచ్చిన వారిని చావబాదారు, సమాచారం చేరవేయకుండా టెలిఫోన్ తీగలను కత్తిరించేశారు. రాత్రి 11 గంటల ప్రాంతంలో బందిపోట్లు గ్రామంలోకి ప్రవేశించారట. వెంకటగిరి ఆర్టీసి డిపోలో పనిచేసే డ్రైవర్ కోల సుధాకర్ డ్యూటీ దిగి తన స్వంత వూరైన దగ్గవోలు పోతున్నారట. అతడ్ని బందిపోట్లు పట్టుకొని వూర్లో తుపాకులు, ఫోన్లు, డబ్బు గల వార్ని గూర్చి వివరాలు అడిగారట. అతను తనకు తెలియదని చెప్పే సరికి చావ గొట్టి, తమతో పాటు తీసుకెళ్లారట.

తొలుత రోడ్డు ప్రక్కన వున్న వై. సుధాకర్ రాజు ఇంటి తలుపులు పగులగొట్టి ప్రవేశించి, 'పైసలెక్కడున్నాయ్' అనే తెలంగాణా యాసలో అడిగారట. కూలికి పోయే వారమని అతని భార్య సమాధానం చెప్పినా నమ్మకం కుదరని బందిపోట్లు ఇల్లంతా చిందర వందర చేసిపారేశారు. ఏమీ దొరకక పోయేసరికి పట్టుకొచ్చిన డ్రైవర్‌తో సహా ఇంట్లోని సభ్యులను గదిలో పెట్టి గడియవేశారు. తర్వాత సమీపంలోని తోటలో వుంటున్న నడింపల్లి సర్పంచ్ సిద్ధయ్యనాయుడు ఇంటి వైపుకు రాళ్లు రువ్వుతూ గలభా చేస్తూ వెళ్ళారు. వరండాలో నిద్రిస్తున్న మునుస్వామినాయుడు, రామానాయుడు దొంగలని గ్రహించి ఎదిరించను పోగా వారిద్దరినీ గాయపర్చారు. తలుపులు పగులగొట్టి ఇంట్లోకి ప్రవేశించేసరికి ఇంట్లోని ఆడవాళ్లు, పిల్లలు హడలి పోయారు. వారందరినీ కూడా ఒక గదిలో పెట్టి గొళ్లెం బిగించి అనంతరం ఇంట్లోని బీరువాను పగుల గొట్టి మూడు సవర్ల బంగారు నగలు, రెండు వాచీలు, 1500 డబ్బు, గదిలో బంధించిన మహిళ మణెమ్మ చెవుల్లోని రింగులు, కాళ్లగొలుసులతో పాటు, 5 జరీ చీరలను చేజిక్కించుకొని అరుస్తూ రోడ్డు పైకి వచ్చారు. ఈ అరుపులకు సమీప ప్రాంతంలోని ఎన్టీఆర్ అల్లుడు చంద్రబాబు నాయుడు తోటలో నివాసముంటున్న భాస్కర నాయుడి కుక్క మొరగడం ప్రారంభించింది. భాస్కర్ నాయుడు పోలీసులకు ఫోన్ చేయను ప్రయత్నించి అది కట్ అయివున్న విషయం తెలుసుకొని భార్య, పని మనిషితో కలిసి ఇంటికి తాళం వేసి పక్క ఇంటికెళ్లారు. వెళ్లే సమయంలో తన వద్దవున్న తుపాకితో ఆరు రౌండ్లు పేల్చారు కాని ఈ గుండ్లలో ఏ ఒక్కటీ బందిపోట్లకు తగలలేదు.

అడ్డు అదుపులేకుండా నాయుడు ఇంటిని చేరుకున్న బందిపోట్లు యధేచ్ఛగా తలుపులు పగులగొట్టి ఇంట్లోకి ప్రవేశించి బీరువాను ధ్వంసం చేశారు. దానిలో వున్న 68 గ్రాముల బంగారం, 15 వేల రూపాయల నగదు, నల్లపూసల దండ ముత్యాల హారాన్ని, ఐదు జతల కమ్మల్ని రెండు జతల రింగుల్ని మూట గట్టుకొన్నారు. పక్కనే వున్న కె. గంగరాజు ఇంటిని కూడా ఇదే రీతిన దోచి పారేశారు.

## వీళ్లు తెలంగాణా వారైతే, వాళ్లు స్థానికులేనని అనుమానం!

**జిల్లావార్తలు**

బందిపోట్లంతా 25-30 సంవత్సరాల మధ్య వయస్సు కల్గి తెలంగాణా యాసలో మాట్లాడినట్లు ప్రత్యక్ష సాక్షులు చెబుతున్నారు. కత్తులు, కర్రలు తప్ప వీరి చేతిలో మరే ఆయుధాలూ లేకపోయినా, గ్రామంలో గలభా చేసుకొంటూ పోయి మరీ దోపిడీ చేసిన తీరును చూసి ప్రజలు, పోలీసులు విస్తుపోతున్నారు. దోపిడీకి గురైన ఇళ్లన్నీ గ్రామానికి కొంత దూరంలో వున్న తోటల్లో వుండడం వల్ల బందిపోట్ల పని సులభమైనట్లుంది.

### ఆరు నెలలుగా జీతాలు లేని అంగన్ వాడి వర్కర్లు

వెంకటగిరి అంగన్‌వాడి ప్రాజెక్టులో పనిచేస్తున్న వర్కర్లు, ఆయాలు గత ఆరు మాసాలుగా జీతాలు లేక అల్లాడుతున్నారు. టి.ఎ. బిల్లు చెల్లించి దరిదాపులు 9 మాసాలయ్యింది. అయితే ప్రాజెక్ట్ కార్యాలయ సిబ్బంది మాత్రం

కొంత 7 పేజీలో

# చంద్రపడియలో చావగొట్టి మరీ పెరుక్కున్నారు!

నిండలిలో జరిగిన ప్రక్కరోజే 29 తేది అర్ధరాత్రి ఆత్మకూరు తాలూకా చంద్రపడియలో బందిపోట్లు తమ ప్రతాపం ప్రదర్శించారు. నిండలి దోపిడి దొంగలు తెలంగాణా యాసతో మాట్లాడితే వీరు స్పష్టమైన నెల్లూరు మాండలికంతో సంభాషించారట. అంటే ఆ ముఠాకు, దీనికి సంబంధం లేదు. ఇటువంటి ముఠాలు జిల్లాలో ఇంకెన్ని తిరుగుతున్నాయో మరి!

చంద్రపడియ గ్రామ పొలిమేరల్లో కొసటినేని విశ్వనాథనాయుడు అనే గుంటూరు జిల్లా రైతు ఇక్కడకు వలస వచ్చి పొలాలలోనే ఇల్లుకట్టుకుని వుంటున్నాడు. అతడి దగ్గర డబ్బు, దస్కం బాగా వున్నట్లు ప్రచారం వుంది. ఇది కనిపెట్టి కాబోలు దాదాపు 15 మంది బందిపోట్లు అర్ధరాత్రి సమయంలో దాడిచేశారు. విశ్వనాథనాయుడు పొలాలలో పనిచేసే కూలీలు ఆ ప్రక్కనే వున్న వేరొక ఇంట్లో పడుకొని వుండినారట. అదీ తెలుసుకొని వచ్చినట్లున్నారు రావడంతోనే వారిని బెదిరించి, కదలకుండా నిలబెట్టేశారు. వారున్న ఇంటినుంచి 4 వేలు పెరుక్కున్నారు. విశ్వనాథనాయుడు మొదట వారిని ప్రతిఘటించాడట. కాని వారి మూకబలం ముందు అతడి ప్రతిఘటన నిర్వీర్యమైపోయింది. పైగా ఆ కక్షతో అతడ్ని చావచితక కొట్టారు. తలపై పెద్దగాయం. లోపల దూరి అతడి భార్య లావణ్య, అత్త వెంకట సుబ్బమ్మలనూ రాళ్లతో, కర్రలతో కొట్టారు. వారికీ నెత్తురు దెబ్బలు. ఈ బాధ భరించలేక ఇంట్లోని నగలు, నగదు సమస్తం సమర్పించేశారట. అయితే, 'మీ దగ్గర ఇంకా ఎక్కువ వుండాలే' అని వారు దబాయించినట్లుతెలిసింది. వీరందరూ స్థానికులేనని అనుమానం. స్థానికులు కాబట్టే అన్ని సంగతులు తెలిసినాయనడం నిజం. దాదాపు తమ సంఖ్యతో సరి సమానంగా కూలీలు ఇంటికి దగ్గరగా వున్నా వారు భయపడక పోవడం. అందర్నీ అదరగొట్టి దోపిడీ చేయడం గమనించదగిన విషయం.

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని పద్దులు.

1) జె. యస్. కమలా బాయ్ జైన్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నం. 49, 18.2.267 కొర్లగుంట రోడ్డు, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 30.10.87 నుండి 4.12.90 తేది వరకు విడిపించని 19 అయిటములు 30.12.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.267 కొర్లగుంట రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) శాంతి లాల్ సునీల్ కుమార్ జైన్ పాన్ బ్రోకర్సు 18.2.267, కొర్లగుంట రోడ్డు, తిరుపతి, పి.బి.యల్.నం. 50, వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 11.3.88 నుండి 12.11.90 తేది వరకు విడిపించని సుమారు 16 పద్దులు 30.12.92 మధ్యాహ్నం 2 గంటల నుండి 18.2.267 కొర్లగుంట రోడ్డు తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి. రామకృష్ణరావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు

# నెల్లూరు వచ్చేవాళ్ళు ప్రముఖులు

### జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్ధనరెడ్డి రేపు(26తేది) జిల్లాకు వస్తున్నారు; 27 తేది రాత్రివరకు వుంటారు.

27 తేది మధ్యాహ్నం ఆయనకు జిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి లంచ్ ఇస్తున్నారు; సాయంత్రం ఇందిరాభవనలో అయోధ్య పరిణామాలపై సభ జరుగుతుంది.

### పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య 26తేది ఉదయం నారాయణాద్రిలో శ్రీకాళహస్తికి వస్తారు. సాయంత్రం వరకు జనార్ధనరెడ్డిగారితో కలిసి వెంకటగిరి కార్యక్రమాలలో పాల్గొంటారు. 27 తేది కూడా గురువుతో బాటే వుంటారు. 28తేది ఉదయం పెంచలకోనలో దేవుణ్ని సందర్శించి, నాయుడుగారి సభలు చూసుకొని, రాత్రికి నెల్లూరులో ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్ ఎక్కుతారు.

### గరుడవాహనం

రంగనాథుడి సేవకు బంగారు గరుడవాహనం వచ్చేసింది. పూర్వపు కళాకాంతులను పుణికి పుచ్చుకొని, ధగధగ లాడుతూ ఆలయ ప్రవేశం చేసింది 22 తేది రాత్రి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ కె.నరసింహాచారి తిరుపతికి వెళ్ళి, టిటిడి బంగారు కర్మాగారం నుంచి వాహనాన్ని లారీలో నెల్లూరుకు తీసుకవచ్చారు.

ఆరేళ్ల క్రితం, 1986 జూన్‌లో పెంచలకోన తిరువాళ్లలో రంగడి గరుడవాహనం దగ్ధమైపోయింది.

1904 లో ముప్పిరాల నరసింహాచార్యులు అనే భక్తుడు తన స్వంత నిధితో తయారుచేయించిన వాహనమది. దాన్ని తిరిగి తయారు చేయించాలని 1986 నుంచి ప్రయత్నించారు. ఫోటోల ఆధారంగా యథాతథంగా వాహనాన్ని పునర్నిర్మించడానికి టిటిడి అంగీకరించింది. కాని డబ్బు దగ్గరే పేచీ పెంచలకోన దేవస్థానం లక్షా 50వేలు ఇచ్చి చేతులు కడుక్కున్నది: వాహనం

కొంత 7 పేజీలో



కళ్ళు చెదరేలా రూపుదిద్దుకున్న రంగడి కొత్త బంగారు గరుడ వాహన ముఖారవిందం; సంక్రాంతి నాటికి సింగారమౌతుంది

# మెజిస్ట్రేట్‌నే కొట్టబోయిన కానిస్టేబిల్

పోలీసు తల్చుకుంటే దెబ్బలకు, కేసులకు కొదవేముంది? సాధారణ జనాన్ని లాకప్‌లో చావచితక కొట్టి, కేసుల్లో ఇరికించి వినోదాలాడే పోలీసులకు -వెరైటీ కావాలనిపించిందేమో ఏకంగా మేజిస్ట్రేట్ పైనే దొంగకేసు పెట్టి చరిత్ర సృష్టించారు.

అనుమ సముద్రం పేట పోలీస్ కానిస్టేబిల్ కె. రామరత్నం ఉరఫ్ రాజయ్య, ఒక అత్యవసర ఎఫ్ఐఆర్ దాఖలు చేయడానికి నెల్లూరు సెకండ్ అడిషనల్ మేజిస్ట్రేట్ షేక్ ఇంతియాజ్ అహమ్మద్ దగ్గరకు వచ్చాడట. అప్పటికి రాత్రి ఏడున్నర కావడంతో నేరుగా మేజిస్ట్రేట్ ఇంటికి వెళ్లారు. అయితే తాను సెలవులో వున్నందువల్ల ఆ కాపీని ఇన్‌చార్జి న్యాయమూర్తి ఎవరో కనుక్కొని, ఆయనకు ఇవ్వమని చెప్పారట మేజిస్ట్రేట్ గారు. ఆ మాటకు కానిస్టేబిల్ దొరగారికి కోపం పొడుచుకొని వచ్చింది రిపోర్టు తీసుకోనని ఒక కాగితం మీద వ్రాసి సంతకం పెట్టివ్వమని దబాయించాడట. పాపమా న్యాయమూర్తి బిత్తరపోయి, అట్లామాట్లాడడం తప్పు అని వారించడంతో అతడు ఇంకా రెచ్చిపోయాడట. ఇంట్లోని జవాన్‌ను పిల్చి, అతడ్ని బయటకు పంపించమని చెప్పేసరికి, క్రుద్ధుడై ఒక్కసారిగా మేజిస్ట్రేట్‌పై చేయెత్తాడట. ఈలోగా ఇంట్లోనివారు వచ్చి, అతడ్ని ప్రక్కకు లాగి పంపించివేశారు. పాపమా న్యాయమూర్తి ఏమీచేయలేక విషయాన్ని జిల్లాజడ్జి, అడిషనల్ జిల్లా జడ్జిలకు ఫోన్‌లో తెల్పాడట. కాని కానిస్టేబిల్ మాత్రం అక్కడితో ఆగలేదు. నేరుగా వన్‌టౌన్ స్టేషన్‌కు వెళ్లాడట. అక్కడ తోటి కానిస్టేబిళ్లు జరిగింది తెలుసుకొని, మేజిస్ట్రేట్‌తో పేచీ పెట్టుకొని వస్తే మసైపోతావని హెచ్చరించి, తప్పించుకోవడానికి ఉపాయంగా మేజిస్ట్రేట్‌పైనే కేసు పెట్టమని సలహా ఇచ్చారట. అంతే క్షణాలలో అతడు ఒక రిపోర్టు వ్రాయడం, స్టేషన్‌లో మేజిస్ట్రేట్‌పై కేసు నమోదు కావడం జరిగిపోయింది. న్యాయమూర్తి తనను కులంపేరుతో దూషించాడన్నది కేసు.

ఎంత బరితెగింపు? ఎంత లెక్కలేనితనం? తన ఇంటికి వచ్చేవరకు ఈ కానిస్టేబిల్ ఎవరో న్యాయమూర్తికి తెలిసే అవకాశం లేదు. అటువంటప్పుడు న్యాయమూర్తికి అతడి కులం తెలిసేదెట్లా.

ఒక సాధారణ కానిస్టేబిల్ న్యాయమూర్తిని గద్దించి, కొట్టబోవడం, తప్పుడు కేసు పెట్టడం దారుణమైన విషయం. ఖాకీ యూనిఫారం వేసుకున్నంత మాత్రాన తాము మానవాతీతులమని, ఎంతటివారిపై నైనా జులుం ప్రదర్శించే హక్కు తమకు వుంటుందనే అహంభావం పోలీసులలో పెరిగి పోవడం ఏమాత్రం క్షంతవ్యం కాదు. న్యాయవాదులు, ఇతర ప్రజాస్వామ్య అభిమానులు ఈ సంఘటనపై ప్రతిస్పందించి పోలీసు దురహంకారానికి తీవ్ర ప్రతిఘటన నివ్వాలి! పోలీసు అధికారులూ తమ శాఖ ప్రతిష్ఠ పేరుతో లోపాయికారీ మార్గాలు వెదకకుండా ఆ కానిస్టేబిల్‌ను, గ్రుడ్డిగా కేసు రిజిస్టరు చేసిన వన్‌టౌన్ పోలీసులను సస్పెండ్ చేయడం

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ కొరవ)

ఖర్చుమాత్రం 10లక్షలు దాటింది. టౌనులో విరాళాలు 90వేలకు మించలేదు. ఆ దశలో మాగుంట సుబ్బరామిరెడ్డిగారు ముందుకు వచ్చి 5లక్షలు విరాళంగా ఇచ్చారు. ఆయనే వలుకుబడి వుపయోగించి పెండున్నర లక్షల దర తగ్గించేందుకు టిటిడిని ఒప్పించారు. వాహనం ముస్తాబై పోయింది. దటి కుదిరింది బొమ్మ. మొత్తం బరువు 65 కిలోలు; అందులో రెండున్నర కిలోలు బంగారం; తక్కినది రాగి. రేపు మార్చిలో జరుగనున్న బ్రహ్మోత్సవాలలో రంగడు ఆరేళ్ల తర్వాత బంగారు గరుడవాహనమెక్కి దర్శన మిస్తాడు.

### ఆర్యవైశ్యసంఘం ఆడంబర ఎన్నికలు

జిల్లా ఆర్యవైశ్య సంఘానికి 20తేది ఉదయం మహా ఆట్టహాసంగా ఎన్నికలు జరిగాయి. మునిసిపల్ ఛైర్మన్ ఎన్నికను జరిపేంత ఆగం, ఆడంబరం ప్రదర్శించారు. డబ్బు మంచినీళ్లమాదిరి పారింది. పోటాపోటీగా వుండిన పోలింగులో శ్రీవిదెళ్ల వెంకటేశ్వర్లు గెల్చారు; శ్రీతె. తిరుమలరావు ఓడారు.

### కిసాన్‌మేళ

నెల్లూరు రైస్ రీసర్చ్ స్టేషన్‌లో 29 తేది మంగళవారం కిసాన్ మేళ జరుగుతుంది. రైతులకు హార్థిక ఆహ్వానమందజేస్తున్నారు స్టేషన్ అధిపతి డాక్టర్ రాఘవరెడ్డి.

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ)

నెలసరి జీతాలు ఖచ్చితంగా తీసుకొంటున్నారు. 1989 లో మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి కృషి మేరకు ఈ ప్రాజెక్ట్ ఏర్పాటు చేయడం జరిగింది. వెంకటగిరి, బాలాయపల్లి, డక్కిలి మండల పరిధిలో 276 మంది వర్కర్లు ఆయాలు ప్రాజెక్టులో పనిచేస్తున్నారు. వీరిలో వర్కర్లకు 275 రూపాయలు, ఆయాకు 110 రూపాయలు గౌరవవేతనంగా ఇస్తున్నారు. ప్రాజెక్ట్ ప్రారంభమైన తొలి రోజుల్లో మినహా ప్రస్తుతం ఈ ప్రాజెక్టుకు పూర్తి స్థాయి అధికారిణి లేకపోవడం వల్ల ఇన్‌ఛార్జీగా సూపర్ వైజర్ వుండడంవల్ల ఆయనకు బిల్లులు తయారు చేసే సామర్థ్యం లేక పోవడం ఈ స్థితికి కారణమట. కార్యాలయం లోని సీనియర్ అసిస్టెంట్ జీతాల వివరాలు పట్టిక తయారు చేయను 10 శాతం మామూళ్లు అడుగుతున్నారట. వున్నతాధికారులు జోక్యం చేసుకొని కష్టాల్లో వున్న తమను ఆదుకోవాలని వీరు కోరుతున్నారు.

### తుమ్మగుంటలో కార్యక్రమాలు

నూతన సంవత్సరం, సంక్రాంతిని పురస్కరించుకొని తుమ్మగుంట అయ్యప్ప స్వామి దేవాలయంలో ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. జనవరి 1 తేది సుప్రభాత దర్శనం, అభిషేక పూజలు జరుగుతాయి.



## పంచాంగము

### పంచాఙ్గాం

పండుగ నెల శూన్యమాసము జరుగుచున్నది.

### ఇంగ్లీషు సంవత్సరాది

1993 జనవరి 1 తేది

### డిశంబర్ నెల తిథులు

పుష్య శుద్ధ

తే 26 శని విదియ ఉ.గ. 7.30వ
తే 27 ఆది తదియ ఉ.గ. 8.30వ
తే 28 సోమ చతుర్థి ఉ.గ.10.25వ
తే 29 మంగళ పంచమి ప.గ.12.30వ
తే 30 బుధ షష్టి ప.గ 2.40వ
తే 31 గురు సప్తమి ప.గ. 4.30వ

1993 జనవరి నెల తిథులు

తే 1 శుక్ర అష్టమి రా.గ. 6.30వ

స్వయపాకుల శ్రీనివాసులు ఎం.ఏ



## పోతనామాత్యునికి గూడూరులో దేవాలయము

లోకంబులు, లోకేశులు, లోకస్థులు, తెగిన తుదిపె లోకంబగు, పెంచీకటి, కవ్వల, నెవ్వడొకా కృతి వేలగు, నతని నేసేవింతున్ (Go very Deep into the heart and to home a glimse of illunination) పోతనా మాత్యుని, భాగవతము నాకు జ్ఞానాన్ని ప్రసాదించి, మాయను, కొంత తొలగించినది– వారినే దైవముగా, అవతార మూర్తిగా, ప్రార్థించుచూ పూజ చేస్తూంటాను.

శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు. భాగవతములోని ధర్మ సూక్ష్మాలను అంతరార్థములను, అర్థవాదము (Ale gorns) సాంకేతిక వాదము (Symbolism) అందించియున్నారు. వారు ధన్యజీవులు. వారు నాకందించిన దీవెనకు కృతజ్ఞుడను. (Ref: భాగవత సామ్రాజ్యము)

పోతనా మాత్యునికి వారిని భాగవతము తెలిగించ, ఆదేశించిన, ఆ శ్రీ రామచంద్రుని (Back Ground God) ఆలయ నిర్మాణము, గూడూరులో, నిర్మించాలని, సంకల్పము చాలకాలముగా యున్నది. ధనము కొరకు, ప్రయత్నించెదను. శ్రీ రాము దివ్వకపోవునా?

భక్తరామదాసంత, అపఖ్యాతి లేదు. ఖ్యాతి లేదు. ప్రార్థించుచున్నాను. ఇంకా ప్రార్థించుతాను. నాకు అగుపడుతాడు. అభయమిస్తాడు. నెరవేరుస్తాడు. అంతా రసజ్ఞులు, సహృదయులదే నాదేమున్నది.

దేశ పిత, మహాత్మాగాంధీ బానిసలను, దాస్య శృంఖాల నుండి, విముక్తి చేసివారే, అచ్చట విఘ్నేశ్వరుడు. ( ఓం - Cross Section of Lord Vigneswara) మొదట పూజనీయుడు వారు వెంట వుంటారు. ఉండాలనే ఆకాంక్ష.



ఈ పాకే ఆర్‌ఎస్ఎస్ కార్యాలయమట— రామలింగాపురంలో రైలు కట్ట ప్రక్కనున్న దీనికి అధికారులు 'సీల్' వేశారు

# శివారెడ్డి పద్యాలు

### కలము

అస్తిపాస్తి కొరకు ఆరాటపడబోను
కొలువు లిమ్మంచు కోరబోను
కట్ల పొరలు గ్రమ్మి కష్టాలు బరుతుంద
సాగదంల కలము చావుగుంది!

కవిగ వచ్చింతకాలమ్ము వున్న నై
బాగవోగ యాజ్ఞ బ్రతకనై
కలము సాగనై కలకాలముంటాను
లేకపోత వెంట్నె పైకిబోత!

### అమ్మనాన్న

మాట పలుకులేదు మటుమాయమయి
అరుపదేళ్ళక్రితం అమ్మానాన్న
మర్ళి తిరిగిరాల మాకొస్టె కనిపిల
అంతుపంతులేదు యింతవరకు!

పోయిన వారు తిరిగి పుట్టింది యీనాటి
వరకు లేదు, వట్టి వట్టికబుర్లు
అన్నిదెలిసి తాముకూడ పడతారు
చేసికండి, చింత మానుకోండి

### భారతీయ జనత

భారతీయ జనత బాధలు అవివేరు
రాజకీయ మేరు రచ్చలేరు
తెలుగుదేశం పార్టీరు తెన్నులేరు
కత్తిసుత్తి మత్తు ఎత్తులేరు

కాంగిరేసు పైన కన్నెర్ర జేస్తావు
సాకుజెప్పి పైకి దూకుతావు
తప్పుతప్పు ఓయి తమ్ముడాబిజెపి!
సద్దుకోర పెద్ద పాకు నీకు

పాలిటిక్సు అంటె పరిగెత్తి పొయ్యేది
బడికి సున్నజుట్టి బాల్యమందు
ఎందుకింక నాకు యీ రాజకీయాలు
తిట్లు కొట్లు ప్రొద్దు దిరిగినాక

### స్వామిఅయ్యప్ప

ఆశ్రమాలు, గుళ్లు అయ్యప్పస్వామన్న
అరపరాని భక్తి అంతవరకె,
కాని బట్టలీడు కట్టింది లేనేల
యింతవరకు కవిది యిటోక పైపు.

## అయోధ్య

(2 పేజీ కొరవ)

పదివున్నప్పుడు దేశ ప్రయోజనాలకోసం తమ స్వంత ప్రయోజనాలను పణంగా పెట్టగల త్యాగ భావం ఎవరిలోనూ కన్పడక పోవడమే దురదృష్టకర పరిణామం. పివిని బలవంతపెట్టి మూడు రాష్ట్రాలలోని బిజెపి ప్రభుత్వాలను అకస్మికంగా రద్దుచేయించడం; కోపి. అద్వానీల అరెస్ట్ తర్వాత కూడా బిజెపి నాయకులను తరిమి తరిమి వేధించాలని ఒత్తిడి తేవడం వంటి చర్యలు సెక్యులర్ శక్తుల ఏకీకరణ అనే నూతన నినాదాన్ని శంకించేట్లు చేస్తున్నాయి. బిజెపిని ఇంకా వేధిస్తే ఆ పార్టీపై ప్రజలలో లేనిపోని సానుభూతి పెరుగుతుంది. తమ పార్టీ విధానాలపై అసంతృప్తి ప్రకటిస్తున్న వాజ్‌పేయి వంటి మితవాదులను ఉగ్రవాదులు మాదిరి చూడటం కూడా మంచిది కాదు. వాజ్‌పేయి వంటి మితవాదులా ఒమాబారతి మాదిరి దాండనత్వాని గ్రీని ఒప్పల్ అవ్వక తప్పని పరిస్థితి ఎర్పడుతుంది. ఈ రోజు దేశ ద్రోహులుగా, శాంతియుత సహ జీవనానికి భంగకారులుగా భావింపబడుతున్నవారు, అమరవీరులుగా చెలామణయ్యే ప్రమాదం కల్గుతుంది. అదే జరిగితే సెక్యులర్ శక్తుల ఏకీకరణ ఎంత విస్తృతంగా జరిగినా వ్యర్థమే! దొరికిందే సందని బిజెపిపై తమ ప్రతాపం ప్రదర్శించడానికి సిపిఎం వంటి పార్టీలు చేస్తున్న ప్రతిపాదనలు, ప్రధానమంత్రిత్వంపై మక్కువతో కాంగ్రెస్‌లోని అర్జున్‌సింగ్ వర్గం ఒత్తిడి తెస్తున్న తీరు చూస్తే భయం కల్గుతున్నది. రాజకీయ పరంగా బిజెపిని ఒంటరిని చేయవలసింది పోయి చట్టపరంగా, అధికార ప్రయోగంతో వారిని తరమడానికి ప్రయత్నిస్తే ఎదురయ్యేది [illegible] పరిణామాలే!

రానున్న ఎన్నికలలో తర్వనించబోయే నినాదం మతం. ద్వారా రామజన్మభూమిలో దేవాలయ నిర్మాణం ఆవశ్యకతను ప్రచారం చేసి, హిందువులను ఆకర్షించడానికి బిజెపి కృషి చేస్తుంది. గత ఎన్నికలలోనే వారు ఆ ప్రచారపు ఫలితాలు చవిచూచారు. ఈ సారీ వదలిపెట్టరు. సాధారణ హిందువులలో కన్పిస్తున్న వాతావరణాన్ని బట్టి అదెంత ప్రమాదకర పరిస్థితో వూహించలేము. బిజెపి కేంద్రంలో అధికారంలోకి వస్తే దేశంలోని ఏ మైనారిటీ మతస్తుడూ భద్రతా భావంతో బ్రతకలేడు. భజరంగదళ్ వంటి ఉడుకుమిడుకు సంస్థల నుంచి వచ్చే నాయకులు పరిస్థితిని ప్రశాంతంగా వుంచుతారని భావించలేము. వాజ్‌పేయి వంటి 'సాత్వికుల' కు అదుపుండే అవకాశమూలేదు. అటువంటి పరిస్థితిలో దేశంలో ఎన్నిరాష్ట్రాలు కాశ్మీర్‌ను తలపింపజేస్తాయో వూహించగలమా?

ఈ ప్రమాదం తప్పాలంటె జాతీయ రాజకీయరంగం నుంచి బిజెపిని ఏకాకిని చేయాలి; అది జరగాలంటె పార్టీలకతీతంగా సెక్యులర్ శక్తులన్నీ ఏకం కావాలి! పత్రికా ప్రకటనలకు, అవిశ్వాస తీర్మానాలకు పరిమితమయ్యే ఏకీకరణ వ్యర్థం; స్పష్టమైన విధానాలతో ఏకత్రాటిపైన నడిచే కలయికే శరణ్యం. అది సంభవమా? సాధ్యమా?



అధికారులు సీల్ వేసిన నెల్లూరు జమాతే ఇస్లామి కార్యాలయ భవనం; కోట మిట్టలో వుందిది!

## కోట్ల

(మొదటి పేజీ కొరవ)

పట్ల తక్షణం ఏదో ఒక నిర్ణయం తీసుకోకపోతే పార్టీ కష్టాల పాలు కాక తప్పదని ఈ నెల 21 న జరిగిన కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ సమావేశంలో పలువురు ఎమ్మెల్యేలు ఆందోళన వ్యక్తం చేశారు. తెలుగుదేశం సారా వ్యతిరేక ఉద్యమానికి బాహాటంగా మద్దతిస్తూ ప్రజల్లో దూసుకుపోతుండగా కాంగ్రెస్ మాత్రం ప్రజాసంక్షేమం విస్మరించి 'సర్కారు ఖజానా' కోసం తాపత్రయం చేస్తోందన్న విమర్శలను ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రి దృష్టికి తెచ్చారు. సారా వ్యతిరేకత వల్ల నియోజక వర్గాలకు వెళ్లాలంటె ఇబ్బందిగా ఉంటోందని, ప్రజలు చొక్కా పట్టుకొని నిలేసే వరకు దీన్ని సాగదీయడం మంచిది కాదని ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రిని కోరారు. నెల్లూరు ఎమ్మెల్యే జె.కె. రెడ్డి సంపూర్ణ సారా నిషేధం విధించాలని, పాటలు లేని నెల్లూరు జిల్లాలో తక్షణం ప్రయోగాత్మకంగా సారా నిషేధించాలని కోరారు. కాంగ్రెస్ పార్టీ మహిళా శాసనసభ్యులంతా సంపూర్ణ సారా నిషేధానికి మద్దతు పలికారు. అయితే జీవన్ రెడ్డి, రత్నబోస్ మాత్రం సారా నిషేధం కూడదని వాదించారు. మెజార్టీ ఎమ్మెల్యేలు నిషేధం పట్లనే మొగ్గుచూపారట. మొత్తం మీద తుది నిర్ణయం ఏమీ లేకుండానే సారా పై చర్చ ముగిసి [illegible] సమావేశానికి వాయిదాపడటంపై ఎమ్మెల్యేలు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

సారాపై నియమించిన మంత్రివర్గ ఉపసంఘం తన నివేదిక సమర్పించి అప్పుడే నెల రోజులు కావస్తోంది. దానికి ప్రస్తుత శీతాకాల సమావేశాల్లోనైనా మోక్షం కల్పిస్తాయని ఎమ్మెల్యేలు ఆశించారు. ఈలోగా సమావేశాలు పూర్తయ్యాయి. ఎప్పటి మాదిరిగానే ముఖ్యమంత్రి వచ్చే జనవరికి సారా పై నిర్ణయం తీసుకోగలమని చెప్పి పొద్దు పుచ్చారు.

రానున్న అసెంబ్లీ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని మంత్రివర్గ ఉపసంఘం తెలివిగా నివేదికను రూపొందించింది. ఈ ఏడాది ఎలాగూ గడిచి పోయింది కాబట్టి వచ్చే ఏడాది మూడు ప్రాంతాల్లో మూడు జిల్లాల్లో ప్రయోగాత్మకంగా సారా నిషేధం విధించి, ఎన్నికల ముందు సంపూర్ణ నిషేధం ప్రకటించాలని ఉపసంఘం సిఫార్సు చేసినట్లు తెలుస్తోంది. గుడ్డిలో మెల్లగా ఉన్న ఉపసంఘం సిఫార్సులను అయినా అమలు చేస్తే బాగుంటుందని ఎమ్మెల్యేలు కోరుతుండగా ముఖ్యమంత్రి మాత్రం జాప్యం చేస్తున్నారు. ముఖ్యమంత్రి మనసులో ఏముందో ఇంతవరకు తన సన్నిహితుల వద్ద కూడా బయట పెట్టలేదు.

# కాకినాడ శ్యామల భర్త హత్య

'మరోచరిత్ర' వంటి పలు చిత్రాలలో నటించిన కాకినాడ శ్యామల (44) గోవిందబాబు (54) అనే వాయిద్యాకారుడు, నిర్మాతను ప్రేమించి పెళ్లి చేసుకుంది. 15 తేది రాత్రి గోవిందబాబు ఒక క్లబ్ నుంచి మద్రాసు కోడంబాక్కంలోని తన ఇంటికి వచ్చాక గదిలోకెళ్లి, కాస్త మద్యం సేవించారు. ఆయనతో పాటు వారి పనిమనిషి నాగరత్నం (16) కూడా మద్యం సేవించింది. వీళ్ల కారు డ్రయివర్ సూర్యబాబు(36) ఒక దుడ్డు కర్రతో గోవిందబాబు, నాగరత్నం తలల పై బలంగా బాది, వాళ్ళను చంపేశారు. కాస్సేపయ్యాక ఆటోలో ఇంటికొచ్చిన శ్యామల తల మీద కూడా సూర్యబాబు బలంగా గాయాలు చేశారు; ఆమె ఇప్పుడు విజయానర్సింగ్ హోమ్‌లో క్రమక్రమంగా తేరుకుంటోంది. ఈ ఘటనలు జరిగిన వెంటనే పారిపోయిన నిందితుని కోసం పోలీసులు గాలిస్తున్నారు. బందరు వాస్తవ్యుడైన సూర్యబాబు పదేళ్ళుగా కాకినాడ శ్యామల కారు డ్రయివర్‌గా పని చేస్తున్నాడు. ఆరు నెలల క్రితం అతనికి గోవింద బాబుకి ఏదో విషయమై తగాదా రాగా, అతడ్ని పనిలోనుంచి తీసేశారు. డిసెంబర్ 12వ తేదీన సూర్యబాబు తాను ఉద్యోగం లేకుండా కష్టపడుతున్నానని చెబితే గోవిందబాబు మళ్ళీ అతడ్ని తన కారు డ్రయివర్‌గా తీసుకున్నాడు. ఈ హత్యలకు కారణమేమిటో తెలియదు.

అశ్వమేధంలో బాలకృష్ణతో మీనా

# తమిళ నటులపై నిర్మాతల ఆంక్షలు

## తెలుగువారిలో ఈ ఐక్యత ఎప్పుడొస్తుందో!

చిత్ర నిర్మాణ వ్యయాన్ని అదుపు చేయడంలో భాగంగా నటీనటుల పారితోషికాలను తగ్గించే విషయమై తమిళ చిత్ర నిర్మాతలు ఇటీవల పలు సార్లు సమావేశమయ్యారు. ప్రతి పాత్రధారుడూ తన పారితోషికాన్ని కొంత తగ్గించి తీరాలని, అలా తగ్గించని ఆర్టిస్టును ఎవరూ బుక్ చేసుకోకూడదని, అలా చేసుకుంటే ఆ నిర్మాతను తమ సంఘం నుంచి బహిష్కరించడం జరుగుతుందని ఆ సమావేశాల్లో తీర్మానించారు. ఇలాగే ఒకప్పుడు తెలుగు నటీనటుల పారితోషికం తగ్గింపు విషయంలోనూ తెలుగు నిర్మాతలు సమావేశమై తీర్మానాలు చేసుకున్నారుగాని, వాటిని పాటించే వారులేక అంతా హుళక్కి అయింది. అయితే తమిళ చిత్ర నిర్మాతల విషయంలో అలా కాదు. వాళ్ళల్లో ఐక్యత వుంది. తీసుకున్న నిర్ణయాలను ఎవరూ అతిక్రమించరు.

### దుర్మరణం పాలైన నటి

"లాయర్ భారతి దేవి" తెలుగు చిత్రంలో నటించిన నటి మోనిషా (21) ఇటీవల కేరళలో కారు ప్రమాదంలో మరణించింది. ఈమె ప్రయాణం చేస్తున్న కారును కేరళ రోడ్డు రవాణా సంస్థ బస్సు ఢీకొనడంతో ఈమెతో పాటు కారు డ్రయివర్ కూడా మరణించాడు. ఈమె తల్లి స్వల్పగాయాలతో గండం నుంచి బయటపడింది. "నక్షత్రంగళ్" అనే మలయాళ చిత్రం ద్వారా మోనిషాకు 'ఊర్వశి' అవార్డు లభించింది.

# చిరంజీవి పై ఇన్‌కంటాక్స్ దాడి చేయకూడదా?

హీరో చిరంజీవి భవంతులు, కార్యాలయాల పై ఆదాయపు పన్ను శాఖ వారు ఇటీవల దాడి చేయడంతో రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుంచి ఆయన అభిమానులు తీవ్రంగా నిరసన వ్యక్తం చేస్తున్నట్లు ఈ మధ్య ఒక దినపత్రిక బాక్స్‌మేటర్ ప్రచురించింది. ఇది ఎంత వరకు నమ్మశక్యమో అందరికీ తెలిసిందే. అసలు చిరంజీవి పారితోషికం కోటి, కోటింబావు దాటినట్లు సినిమా వార పత్రికలకు స్టేట్‌మెంట్లు ఇచ్చింది వీళ్ళేగా? అవి సహజంగా ఆదాయపు పన్ను శాఖ వారిని ఆకర్షించి వుంటాయి. వారి విద్యుక్తధర్మాన్ని వారు నిర్వహించారు. అందుకు అభిమానుల నిరసన ప్రసక్తి ఏముంది? కొంత కాలం క్రితం బెంగళూరులో హీరో రాజ్‌కుమార్ భవంతులు, కార్యాలయాల పై ఆదాయపు పన్ను శాఖ వారు దాడులు జరిపినప్పుడు ఆ హీరో అభిమానుల చేత అల్లరి చేయించడానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. రెచ్చిపోయిన అభిమానులు ఘెరావో చేయడానికి వచ్చినప్పుడు ఆ శాఖ అధికారులు "మాకూ మీలాగే ఆయన అభిమాన నటుడే. అది వ్యక్తిగత విషయం. ఇది మా వృత్తి ధర్మం. ద్రవ్యోల్బణం, వస్తువుల ధరలు మితిమీరడానికి పరోక్షంగా నల్లధనం కారణం" అని వివరించే సరికి అభిమానులందరూ శాంతించి, తోకలు ఝాడించి వెళ్ళిపోయారు. చిరంజీవి పై ఆర్థిక శాఖ వారు దాడి చేయడం ఏ పరిస్థితికి దారి తీస్తుందోనని చిరంజీవి ఆందోళన చెందుతున్నట్లు కూడా ఆ దినపత్రిక పేర్కొన్నది. ఏ పరిస్థితికి దారి తీయనందుకు చిరంజీవికి ఆందోళన కల్గివుండాలి.

### చిట్టెమ్మ మొగుడు లో ఓ పాట

బొడ్డులో రూపాయి బిళ్ళ
ముందు చూస్తే బొమ్మ ముద్దొస్తూ
వున్నాది.
ఎనక చూస్తే దిమ్మ ఎర్రెక్కి పోతుంది.

ఎ. కోదండ రామిరెడ్డి దర్శకత్వంలో ఎ. శ్రీధర్ రెడ్డి నిర్మిస్తున్న 'చిట్టెమ్మ మొగుడు' చిత్రంలోనిది పై పాట; ఎంత పసందుగా వుందో చూడండి. జనవరి 14 సంక్రాంతి కానుకగా విడుదలవుతున్నది చిత్రం. మోహన్‌బాబు,

కాంత 11 పేజీలో

# రసరమ్యం - రోజా

చిత్రసమీక్ష

అల్లూరు రహీం

దర్శకుడు మణిరత్నం భావకుడు. తన మదిలో మెదిలే భావాలను తెరపై అద్భుతంగా చూపి ప్రేక్షకులను సమ్మోహితులను చేయగలడు. ఆయన తీసిన రసరమ్య చిత్రం 'రోజా' లోని సన్నివేశాలు ప్రేమికుల హృదయ తంత్రులను మీటుతాయి. పెద్దలకు గత కాలపు స్మృతులు గుర్తుకు తెస్తాయి. కొన్ని వళ్లు జలదరింప జేస్తే, మరికొన్ని ఇప్పటికి మనం చూడని సుందర, సుమధుర దృశ్యాలను సాక్షాత్కరింపజేస్తాయి. చిత్రానికి ఎంచుకొన్న కథే సాహసమైంది. కాని కాశ్మీరీ తీవ్రవాదాన్ని బట్టబయలు చేయడం, సమస్యకు పరిష్కారం చూపడం కష్టమనుకొని కాబోలు దర్శకుడు కథను పక్క త్రోవకు మళ్లించినా, స్క్రీన్‌ప్లే పట్టుతో గట్టెక్కించాడు. కేంద్ర హోమ్ మంత్రిత్వ శాఖ అనుమతితో కాశ్మీర్‌లో కొన్ని సన్నివేశాలు మాత్రమే చిత్రీకరించిన దర్శకుడు మిగతా వాటిని ఊటీతో పాటు సెట్టింగుల్లో చూపినా ప్రేక్షకులు గుర్తుపట్టలేనంత పటిష్టంగా మలచి ప్రతిభ నిరూపించుకొన్నాడు. దర్శకుని ఊహలకు ఫొటోగ్రాఫర్ ప్రాణం పోసి దృశ్యాలను సజీవాలుగా నిలిపితే, సంగీతం దానికి సమ ఉజ్జీగా నిలిచింది. డబ్బింగ్ చిత్రమైనా ఇటీవల విడుదలవుతున్న స్ట్రయిట్ చిత్రాలకు మిన్నగా వున్న రీరికార్డింగ్, ఎడిటింగ్, అప్పుడే చిత్రం పూర్తి అయిందా అనిపిస్తుంది.

కథలోకి వస్తే మిలటరీలో క్రిప్టాలజిస్ట్ అయిన రిషి కుమార్ (అరవింద్ గోస్వామి), పల్లెటూరి పిల్లను పెళ్లి చేసుకోను కపిలేశ్వర పురం వస్తాడు. రోజా (మధుబాల) సోదరి వైష్ణవి తన ప్రేమ విషయం రిషికి చెప్పేసరికి ఆమెను బదులుగా ముద్దుగా వున్న రోజా మనసు పడి ఆమెను పెళ్లి చేసుకొంటాడు. అమాయకురాలైన రోజా తన అక్కను చూడను వచ్చిన వ్యక్తి తనను పెళ్లాడడంతో నొచ్చుకొని అతనికి దూరదూరంగా మసలుతుంది. కొన్ని రోజులకు రిషి ద్వారా వాస్తవాన్ని తెలుసుకొని అక్క ద్వారా ధృవ పరచుకొని చేసిన తప్పుకు చెంపలేసుకొని భర్త చెంతకు చేరుతుంది. ఇంతలో ఒక అత్యవసర సందేశాన్ని డీకోడ్ చేయను రిషి కాశ్మీర్ పోవల్సివస్తుంది. మిలిటెంట్ నాయకుడు వసీంఖాన్ విడుదల కోరుతూ కాశ్మీరీ తీవ్రవాదులు రిషిని కిడ్నాప్ చేస్తారు. భాష తెలియని ప్రదేశంలో రోజా భర్త విడుదలకు అనేక కష్టాలు పడుతుంది. మేజర్ రాయప్ప ( నాజర్), గైడ్ రాజా (జనకరాజ్), చేయూతతో ధైర్యాన్ని తెచ్చుకొని పోరాడుతుంది. చివరకు ఒక తీవ్రవాది మానవతా హృదయంతో రిషిని చంపకుండా వదలి వేయడంతో కథ సుఖాంత మవుతుంది.

చిత్రంలోని కొన్ని సన్నివేశాలు హృదయాలను హత్తుకుంటాయి. రిషిని కిడ్నాప్ చేసిన తీవ్రవాదులు ప్రభుత్వం తమ నాయకుడ్ని వదలను నిరాకరించే సరికి జాతీయ పతాకాన్ని తగులబెట్టను ప్రయత్నించే సమయంలో రిషి దాన్ని ఆర్పను తన వళ్లు కాల్చుకొనే దృశ్యం హాల్‌లో చప్పట్లు కొట్టిస్తుంది. అదే విధంగా 'జైహింద్' అన్నప్పుడు రిషిని చావగొట్టడం చూసి ఆవేశం వస్తుంది. రోజా దేవాలయానికి వెళ్లి టెంకాయ కొట్టినప్పుడు ఆ శబ్దానికి భద్రతా దళాలు మొహరించడం అక్కడి ప్రస్తుత పరిస్థితికి అద్దం పడుతాయి. భర్త విడుదలకు అధికారులను అడిగి అడిగీ వేసారి పోయిన రోజా నేరుగా జైల్లో వున్న మిలిటెంట్ నాయకుడ్ని నిలదీయడం, ఎవరిదో శవం కాలిపోతున్నపుడు దాన్ని గుర్తు పట్టమని అధికారులు కోరగా రోజా చూపిన బేలతనం వంటి సన్నివేశాలు బాగున్నాయి. రోజా—రిషి సున్నితపు సరస దృశ్యాలు యువత మదిలో ముద్రితమవుతాయి. 'చిన్నిచిన్ని ఆశ' 'నాగమణి నందకాడ ఏమి సగ్గు' పాటల చిత్రీకరణ వెరైటీగా వుంది. గ్రామీణ ప్రాంతాల్లోని ప్రజల ఆప్యాయతకు అద్దంపట్టే సన్నివేశాలు అమోఘం. సంతోష్ శివన్ ఫొటోగ్రఫీ వర్ణనాతీతం. కొత్త సంగీతం దర్శకుడు ఎ.ఆర్. రెహమాన్‌ను బ్యాక్ గ్రౌండ్‌తో పాటు పాటలకు అద్భుత సంగీతం అందించారు. ముస్లింలు 4 పూటలు నమాజు చదువుతారని ఒక చోట తప్పు దొర్లించడం తప్ప మిగతా చోట్ల డబ్బింగ్ అనిపించని విధంగా రాజశ్రీ మాటలు రాశారు. రిషిగా అరవింద

కాంత 11 పేజీలో

# కొనేవారు లేక రీళ్లలో మగ్గుతున్న తెలుగు సినిమాలు!

చాలా చిత్రాలు విడుదలకు సిద్ధమవుతున్నాయి. కొన్ని చిత్రాలకు ఫస్ట్ కాపీలు కూడా వచ్చాయి. కాని, కొనుగోలు దారులే కరువయ్యారు. ఏదైనా చిత్రాన్ని ప్రారంభిస్తే, ముందుగా నైజాం నుంచి ఏ బయ్యరైనా వచ్చేవాడు. ఇది వరకు ఆ ప్రాంతంలో కొంత మంది కలిసి ఒక 'సిండికేట్'గా ఏర్పడి, కొత్త సినిమాలు కొనేవారు. ఇప్పుడు వాళ్ళెవ్వరూ కనిపించడం లేదు. ఇతర ప్రాంతాల నుంచి కూడా బయ్యర్లు రావడం లేదు. లాభాలొస్తే వచ్చేవాళ్ళు కదా? నిర్మాతలు తెలుగు సినిమాల రేంజ్, స్థాయినా గుర్తుంచుకోకుండా, గాలిలో వ్యాపారం చేయడం వల్ల ఏర్పడిన దుస్థితే ఇది. నిర్మాతలు ఎక్కువ రేట్లకు సినిమాలు అమ్ముతుండడం వల్ల తారలు, తదితరులు అమాంతంగా రేట్లు పెంచేశారు. తదనుగుణంగా చిత్ర నిర్మాణ వ్యయం పెరిగింది. ఇప్పుడు బయ్యర్లు తక్కువ రేట్లకు అడుగుతున్నందు వల్ల ఇక ఆ నిర్మాణ వ్యయాన్ని అదుపు చేయడం ఎవరి తరం! అందుకే చాలా మంది నిర్మాతలు అయోమయావస్థలో పడిపోయారు. ఈ పరిస్థితి వస్తుందని ముందే తెలిసినా నిర్మాతలు తొందరపడి బ్రేకులు లేకుండా బండ్లు నడిపారు. ఇప్పుడు ఆక్సిడెంట్ జరిగింది. ఫలితం అనుభవించక తప్పదు కదా?

### మరో హిందీ నటుడు

"నక్షత్రపోరాటం" చిత్రంలో అత్యధిక పారితోషికంతో హిందీ నటుడు కబీర్ బేదిని బుక్ చేశారు. ఆంధ్రప్రదేశ్‌కు తరలి రావాలంటూ ఒక వైపున ప్రయత్నాలు చేస్తూ, మరో వైపున తెలుగు నటులను విస్మరించడం దేనికని కోట శ్రీనివాస రావు వంటి నటులు ప్రశ్నించడం సబబుగానే వుంది. కబీర్‌బేది బొంబాయి నుంచి రావడానికి విమాన ఛార్జీలు, అతను బస చేసే ఫైవ్ స్టార్ ఖర్చులు ఇవంతా అనవసరం కదా? అతను చేసే సెంటిమెంట్ల విలువ ఎంత మందికి తెలుసు!

## గుడివాడ సబ్ కోర్టులో

OS. 57/1984 : EP 39/1990

కొడాలి జయలక్ష్మి DHR

దండమూడి రంగారావు వగైరా JDRs

ఈ నెంబరులో షెడ్యూలు దాఖలా JDR తాలూకు స్వాధీన హక్కు భుక్తములు గలవిన్ని జప్తులు కాబడి వేలం కావలసినవిన్ని 18.1.93 తేదికి వేలం వాయిదా అయి వున్నది. కాన పాటదార్లు వచ్చి వేలం నాడు ఉదయం 10 గంటలకు హాజరై వేలం పాట పాడుకొనేది.

### షెడ్యూలు

1. కృష్ణాజిల్లా పామర్రు సబ్ రిజిష్ట్రారు వారి ఇలాకా పెనుమత్స గ్రామంలోని JDRs తాలూకు హక్కు భుక్త స్వాధీనములు గలట్టిన్ని ఈ డిక్రీ బాకీ క్రింద వేలం కావల్సిన స్థిరాస్తి వివరం Ass. No. 192 యం. 0.30 సెంట్లు గల్గిన పెంకుల ఇంటి నెం. 194/1. రు గల్గిన పెంకుటి భవంతికి హద్దులు.

తూర్పు: జాయింట్ బజారు; దక్షిణం: దండమూడి సత్యనారాయణ; పడమర: మాదుగు అప్పారావు; ఉత్తరం: దండమూడి వీరరాఘవయ్య కొంత వరకు, దండమూడి బలరామకృష్ణ కొంత వరకు, పండలనేని రామయ్య కొంత వరకు; ఈ హద్దుల మధ్య యం0.30 లు ఇంటితో సహా పెంకుటి ఇల్లులో గల్గిన దర్వాజా తలుపులు, కిటికీలతో సహా.

| | |
|---|---|
| DHr Value | Rs. 10,000/- |
| Amina Value | Rs. 12,500/- |

అన్యాక్రాంతములు లేవు.

2) కృష్ణాజిల్లా పామర్రు సబ్ రిజిష్ట్రేషన్ ఇలాకా కృష్ణాపురం గ్రామంలోని JDr కు సర్వ సంపూర్ణ హక్కు భుక్తములు గల ఈ డిక్రీ బాకీ క్రింద వేలము కావలసిన స్థిరాస్తి వివరం.

రి సర్వే నెం. 341/1 లో యం. 0.10 ట్లు

రి సర్వే నెం. 341/2 లో యం. 0.10 ట్లు

రి సర్వే నెం. 341/3 లో యం. 1.13 ట్లు

యం. 1.33 ట్లు లేక 0.539 హెక్టార్లు వల్లం భూమికి హద్దులు:

తూర్పు: పంటబోదె లోని కాలువ; దక్షిణం: పండలనేని వెంకట్రామయ్య గారి భూమి; పడమర: పంట బోదె కాలువ; ఉత్తరము: పంట బోదె కాలువ, ఈ హద్దుల మధ్య వున్న యం. 1.33 సెంట్లు లేక 0.539 హెక్టార్లు.

| | |
|---|---|
| DHr Value | Rs. 50,000/- |
| Amina Value | Rs. 55,000/- |

ఏ.వి. శివరామ్

అడ్వోకేటు

కాపువీధిలో టైటన్ గడియారాల షోరూంను ప్రారంభిస్తున్న ఎం. సాంబశివరావు. షోరూం భాగస్తులు డాక్టర్ శ్రీనివాసులు రెడ్డి, ఉప్పలపాటి రాజ

## ప్రకృతిసేద్యాలు

(4పేజీ కొరవ)

అరికడ్తుందంట. ఇవి స్కూళ్లల్లో నేర్పని విషయాలు. నేలకు ప్రాణంవుంది. దాన్ని కాపాడాలంటారు. ఈ విషయాన్ని ఎక్కువమంది గుర్తించలేదు. ఆ ప్రాంతం పెద్దల్ని ఎందుకు అన్నిసార్లు దున్నుతారని అడిగారట. కాని వాళ్ళు పాతరోజుల్నించి వస్తున్న అలవాటని చెప్పారట.

రెడ్డిగారు వ్యవసాయ పద్ధతుల్లో మార్పుతెస్తూ క్రమేపీ సేంద్రియపు ఎరువులను ఎక్కువగా వాడుతూ ( పేడ, పొలంలోని చీకిన పదార్థం, రోడ్డుపక్క ఆకులు) రసాయనిక ఎరువుల్ని తగ్గిస్తూ వచ్చారట. 100 కిలోల నత్రజని, భాస్వరం, పొటాషియం ఎరువులను,5 టన్నుల సేంద్రియపు ఎరువును వాడటం వల్ల భర్తీచేశారట. అందువల్ల రెండో సంవత్సరంలో తైదుల దిగుబడి 7నుంచి 14 క్వింటాళ్ళకు పెరిగిందట.

వ్యవసాయరంగంలో అధిక ఖర్చుల సంక్షోభాల్ని విశ్లేషిస్తూ బెంగుళూరులోని, పర్యావరణ- ఆర్థిక విభాగం అధిపతి డా. నాదకర్ణి రెడ్డిగారి సేద్యవిధానాన్ని పరిశీలించారు. 1978లో అత్యధిక దిగుబడి పొందారు. ఆ సంవత్సరం 200 కిలోల రసాయనిక ఎరువులు,20 బళ్ల సేంద్రియపుటెరువు వేశారు. పది సంవత్సరాల తర్వాత రసాయనిక ఎరువులవాడకాన్ని పూర్తిగా ఆపివేశారు. ప్రత్యామ్నాయంగా ఎకరాకు 40 బళ్ల సేంద్రియపుటెరువును వాడారు. అందువల్ల తైదుల దిగుబడిలో ఎటువంటి మార్పు లేదు. కానీ అలసందల దిగుబడి మాత్రం ఎకరాకి ఒక క్వింటాలు పెరిగింది.

1978 లో రెడ్డిగారి పొలంనుంచి వచ్చిన పంట విలువ ఎకరాకు 4,800/- అందులో కూలీలు, ఎరువులు, ఇతరత్రా ఖర్చులు 1800/- పోగా నికర లాభం ఎకరాకు 3000/-రూపాయలు. పది సంవత్సరాల తర్వాత ఖర్చు ఎకరాకు 1900/- మాత్రమే. అంతేగాక ఆయన వ్యవసాయ ఆదాయం ఎకరాకు5710/-కి పెరిగింది. దాంతో నికరంగా ఎకరాకి 3810/- రూపాయలు పొందగలిగారు. అంటే పెట్టిన పెట్టుబడిమీద 201 శాతం అన్నమాట.

ప్రస్తుతం నారాయణరెడ్డిగారు తన 7 1/2 ఎకరాల పొలం నుంచి 70 నుంచి 80 వేల రూపాయల నికరాదాయం పొందుతున్నారు. గడచిన సంవత్సరాలలో రెడ్డిగారు నూతన వ్యవసాయ విధానం మీద ఉన్న కలను నిజరూపంలోకి తెచ్చారు. ఏ పంటనూ ప్రత్యేకతగా చూడకూడదు. పొలం మొత్తం మీద ఉన్న పంటలకు, పర్యావరణానికి, నేలకు గల సహజ సంబంధాల్ని చెడగొట్ట కూడదంటారు. ఆయన పొలంలో ఒక ఆకుకూడా వృధాకాదు. పూచిక పుల్లను కూడా కాల్చరు. ఆయన ఉద్దేశ్యంలో మొక్కను శాస్త్రవేత్త చూడరు. అదే రైతు తన పంటను సంపూర్ణ అంశంగా చూస్తాడట. ఉదాహరణకు వరిపండించే రైతుకు తను నారుపోసినప్పటి నుంచి అమ్మేంత వరకు అది ఒక అంశం. శాస్త్రవేత్త అయితే తనకున్న ప్రత్యేక డిగ్రీలవల్ల, ఇతర అంశాల్లో గల అనుభవరాహిత్యం వల్ల అలా చూడలేదు. విత్తనాన్ని, నారుమళ్లను, ఎరువుల వాడకాన్ని పురుగు మందుల వాడకాన్ని, పంటనిల్వచేసే విధానాన్ని ఇలా ఒక్కో అంశాన్ని మాత్రమే శాస్త్రవేత్త చూడగల్గుతున్నారు. అందువల్ల రైతుకు కొన్నిసార్లు నష్టం కూడా కల్గుతుందట.

ఏదైనా కొత్త పొలంలో మొదట పళ్లచెట్లను నాటాలి. తరువాత అంతర పంటలు పెట్టాలి అని సలహా ఇస్తారు రెడ్డిగారు. ఆయన స్వంత పొలంలో కొబ్బరి, జామ, సపోటా, పోకచెట్లున్నాయి. అంతర పంటలుగా, అరటి, మాల్‌బర్రి, పుచ్చ, సోయాచిక్కుడు, వేరుశనగ, అలసంద, కరివేపాకు సాగుచేస్తున్నారు. పశుగ్రాసంగా, సుబాబుల్, పచ్చిరొట్ట ఎరువుగా కానుగ పెంచుతున్నారట. ఇటీవలే వాన పాముల్ని నేలసారాన్ని అధికం చేసేందుకు వాడుతున్నారట. అంతేగాక, ఆయన వ్యవసాయ క్షేత్రంలో ఆవులు, గొర్రెలు కూడా ఉన్నాయి. పేడ సహజంగానే, గోబరుగ్యాస్ ఉత్పాదనకు వాడుతున్నారు.

పురుగు మందులు, కలుపు నివారణ మందులకు రెడ్డిగారు ఆమడదూరం. ఇటువంటి వ్యవసాయ పద్ధతులను పాటించే ఒక రైతుగా, తనకున్న అనుభవంతో విషం మనకు లాభాల్ని ఏ విధంగా చేకూరుస్తుందని ప్రశ్నిస్తారు.

వాటికి బదులు సులీసుగా దొరికే సహజ సిద్ధ పదార్థాల్ని వాడుతారు. ఉదాహరణకు మురగ పెట్టిన సీతాఫలం ఆకుల నీళ్లు, వేప పిండి నీళ్లు, ఆవుపేడతో కలిపి చల్లారట. అందువల్ల పురుగులు చావవు. కానీ పారిపోతాయట. మరైతే రెడ్డిగారు డ్రిప్ ఇర్రిగేషన్‌లో అనుభవజ్ఞుడు. గతంలో పొలాన్ని పూర్తిగా తడిపేందుకు 30 గంటలు నీళ్ళను తోడాల్సి వచ్చేదట. ఇప్పుడు డ్రిప్ ఇర్రిగేషన్ వల్ల అదే పొలానికి 6 గంటలలో నీటి సదుపాయం అందించ గలుగుతున్నారట.

నారాయణరెడ్డిగారి సేద్యం-విజయం.. సారహాన్ని దాటి ప్రపంచమంతా వ్యాపించి, సహజ సిద్ధ వ్యవసాయం పట్ల , పాంప్రదాయ వ్యవసాయంపట్ల ఆసక్తి గలవార్ని ఆకర్షిస్తున్నది.

దానితో అతిధులు, విదేశీ విద్యార్థులు, పరిశోధకులు (వీళ్ళలో కొందరు నెలలపాటు ఉండి పోతున్నారు) ఎక్కువగా వస్తున్నారు. వెళ్ళవలసిన మీటింగులు, చెయ్యాల్సిన ప్రసంగాలు అధికమయ్యాయి.

అందుకే రెడ్డిగారి భార్య, ఉదయంనుంచి సాయంత్రం వరకు ఏదో ఒకటి పాడుతూఉండే తన భర్తపాటలను ఇప్పుడు వినలేకుండా పోతున్నానని తరచూ నిష్ఠూర పడటంలో ఆశ్చర్యం లేదు.

ఏ కాలేజీలోనూ నేర్చుకోకుండా, ఎవరిచేతా పాఠాలు చెప్పించుకోకుండా, తనదైన బాణీలో, పర్యావరణాన్ని కాపాడే వ్యవసాయాన్ని చేస్తూ, లాభాల్ని పొందుతూ, శాస్త్రవేత్తల ఊహల్ని విజ్ఞానాన్ని తలక్రిందులు చేస్తూ, ఇది నిజమని సారహాన్ని లోని తన క్షేత్రంలో రుజువుచేస్తున్న శ్రీ నారాయణరెడ్డిగారి కృషి భారతీయ వ్యవసాయ రంగానికి వెలకట్టలేని ఒక అద్భుతమైన బహుమతి.

## సింహపురి

(4పేజీ కొరవ)

పారుతుంది. రోడ్డు నిలుస్తుంది.

రాజీవ్ గాంధీ విగ్రహం చుట్టూ రోడ్డు పరిస్థితి అదే. రోడ్డు వేసేటప్పుడు ఫ్లాట్ ఫారం కట్టింది మునిసిపాలిటీ. దానికి పెద్ద సైజు పైపులు బిగించి నీరు పోవడానికి దారి ఇవ్వమని చెప్పాము. కాని వారు 3 అంగుళాల సన్నటి పైపులు పెట్టారు. అవి మూసుకపోయాయి. నీళ్లు రోడ్లనే నిల్చిపోయాయి. ఫలితం– రోడ్డు పగిలి పోయింది. జనం మమ్మల్ని తిడుతున్నారు. ఇంకొక వైపు పెద్దాస్పత్రి ఆవరణంలో నుంచి గోడలు దెబ్బతిని నీళ్లు ప్రవాహంలాగా వచ్చి పడుతున్నాయి. మినీ బైపాస్ రోడ్డు పరిస్థితి అంతే. రోడ్డు వేసిన రెండు రోజులకు, లైకాన్ రోడ్డు కల్వర్టు పడిపోయిందని ట్రాఫిక్ అంతటినీ మళ్లించారు. అప్పటికే వారం రోజులు నీళ్లలో నాని వుండిన రోడ్డు, ఆ ట్రాఫిక్ రద్దీకి క్రుంగి పోయింది. ఈ సమస్యలు ఎవరికీ తెలియదు. చూసేవారు మేము నాణ్యత పాటించడం లేదనుకుంటారు. కాంట్రాక్టర్లకు లొంగిపోయి కళ్లు మూసుకొని వున్నామనుకుంటారు. మా బాధలు ఎవరూ పట్టించుకోరు, మా పరిస్థితి ఎవరూ తెలుసుకోరు!

ఇదీ ఆ ఇంజనీరు ఆవేదన. ఆయన వివరణ వింటే సబబుగానే కన్పిస్తుంది. కాని ప్రజలకు కావలసింది ఎవరిది తప్పు, ఎవరిది రైటు అన్న మీమాంస కాదు – పన్నుల రూపేణ తాము చెల్లించే సొమ్ముతో త[illegible] కోసం జరిగే పనులు ఎంత[illegible] మాత్రం అమలు జరుగుతు[illegible] ఏ అధికారి అయినా ఆ కో[illegible] ఆత్మపరిశీలన చేసుకుంటే పరిస్థితి ఏర్పడదు.

## సైకిళ్లపై సాహస యాత్ర

దేశ సమైక్యత, క్రమశిక్ష[illegible] చాటేందుకు నెల్లూరులోని వివిధ కళాశాలల్లోని ఎన్.సి.సి. విభాగాలకు చెందిన 45 మంది విద్యార్థులు నెల్లూరు నుండి కంచికి సైకిళ్లపై సాహస యాత్రకు బయలు దేరారు. 21 తేది జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్‌చంద్ర జెండా ఊపి యాత్రను లాంఛనప్రాయంగా ప్రారంభించారు. కమాండింగ్ ఆఫీసర్ జి.ఎస్.వాలియా, వి.ఆర్.కళాశాల విద్యార్థి పి. ఈశ్వరరావు నాయకత్వాన బయలుదేరిన ఈ బృందం మద్రాసు, మహాబలిపురం, కంచి, చిత్తూరు, మదనపల్లి, హార్సిలీహిల్స్, తిరుపతి మీదుగా నెల్లూరు చేరుకోవడంతో యాత్ర ముగుస్తుంది.

## అయ్యప్ప సహస్ర కలశాభిషేకం

టౌన్‌లోని అయ్యప్పస్వామి దేవస్థానం నందు డిసెంబర్ 26,27 తేదీలలో సహస్రకలశాభిషేకం పూజలు జరుగుతాయి. 2 లక్షల రూపాయల వ్యయంతో అత్యంత వైభవంగా జరుగనున్న ఈ కార్యక్రమాన్ని కేరళలోని పెక్కుదేవాలయాలకు ప్రధాన తంత్రిగా వ్యవహరిస్తున్న శ్రీ కేశవన్ నంబూద్రి పాద్ నిర్వహిస్తారు. కలశాభిషేకాన్ని పురస్కరించుకొని హాజరయ్యే భక్తులందరికీ వుచిత భోజన సౌకర్యం కల్పించనున్నట్లు దేవస్థానం పాలక మండలి తెలుపుతున్నది.

## ఖాతాదారుల సమావేశం

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నెల్లూరు టౌన్ ఖాతాదారుల సమావేశం 23 తేది బారకాసు స్టేట్‌బ్యాంక్ ఆవరణలో జరిగింది. జిల్లాజడ్జి శ్రీ ఇ.ఇస్మాయిల్ ముఖ్య అతిథిగా హాజరైనారు. సమావేశంలో బ్యాంక్ డెప్యూటి జనరల్ మేనేజర్ శ్రీ ఎ. శంకర్, అసిస్టెంట్ జనరల్ మేనేజర్ రాధాకృష్ణయ్య పాల్గొన్నారు. ఖాతాదారుల సూచనలు, సలహాలు, కోరికలను అధికారులు ఈ సందర్భంగా అడిగి తెలుసుకున్నారు. బ్యాంక్ టౌన్ బ్రాంచిల మేనేజర్లు ఎమ్.ఎస్.ఆర్. శేషు, కె.బి.సంజీవరావు, ఎం. కళ్యాణసుందరమ్, టి.ప్రభాకరం కూడా సమావేశంలో పాల్గొన్నారు.

## TO WHOMSOEVER IT MAY CONCERN

Smt. K. Sarojini, Staff Nurse, Beedi Workers Welfare Fund Dispensary, Nizamabad / Siddipet under the Administrative Control of the Welfare Commissioner, Labour Welfare Organisation, Govt. of India, Ministry of Labour, Hyderabad Region, is removed from Govt. Service. with effect from 01.12.1992, for her continuous unauthorised absence from duty since 1st September, 1990.

Place: Hyderabad
Dated: 01.12.1992

V.S. RAO
WELFARE COMMISSIONER
Govt. of India
Welfare Commissioner
Labour Welfare Organisation
Kendriya Sadan
Sultan Bazaar, HYDERABAD - 195

ప్రభుత్వాల రద్దుకు

(2 పేజీ కొరవ)

అయోధ్య ... 1990 ...
కరసేవకులు బాబ్రీమసీదు గుమ్మటాలపై ఎక్కినప్పుడే ఏదో ఒక అనర్థం జరుగుతుందని ఊహించాము. అనుకున్న దంతా అయ్యింది. అయినా భజనకు చెక్కపిడతలు పట్టుకోవాల్సిన చేతులు పలుగు, పారలు ధరించి వీరవిహారం చేస్తే కేంద్రప్రభుత్వం చేతులు ముడుచుకొని కూర్చోవడం శోచనీయం. మందిరం - మసీదులను గూర్చి తరువాత ఆలోచిద్దాం. ముందు శాంతియుత సహజీవనానికి ప్రతీకలుగానిల్చి, మనిషి జన్మ సార్థకం చేసుకొందాం.

- బి. వెంకటసుబ్బయ్య

రాపూరు.

## ఇవేం ఎన్నికలు బాబోయ్

డిసెంబర్ 20 తేది వప్పుల వీధిలోని అన్నదాన సమాజంలో నెల్లూరు జిల్లా ఆర్యవైశ్యసంఘ ఎన్నికలు జరుగుతున్న విషయం తెలుసుకొని చూచి వద్దామని వెళ్లి, అక్కడి పరిస్థితి చూచి ఆవాక్కయ్యాను. మొదట ఉదయం 10 గంటల కు సర్వసభ్య సమావేశం జరిగింది. అరుపులు, కేకలు, దుర్భాషల మధ్య ఎవరు ఏం మాట్లాడారన్న విషయం అర్థం కాలేదు. తరువాత అధ్యక్ష ఎన్నిక జరుగుతుందని ప్రకటించారు. పోటీలో నిలబడిన అభ్యర్థులిద్దరూ డబ్బు, దస్కం కలవారైనందున అప్పటికే పోటీలు పడి ప్రచారంచేసి, కార్లు, వ్యాన్లు, బస్సుల్లో ఓటర్లను దించిపెట్టారు. సాధారణ ఎన్నికల్లో మాదిరిగానే రిగ్గింగు, బూత్‌ల ఆక్రమణలు జరిగి ఇరువర్గాలు ఘర్షణకు సిద్ధమైన సమయంలో పోలీసులు జోక్యం చేసుకున్నారు. 2 లక్షల మందికి పైగా వైశ్యులున్న ఈ సంఘంలో 2500 మంది మాత్రమే ఓటర్లుగా నమోదై వున్నారట. ఈ సభ్యులను కూడా పోటీచేసిన అభ్యర్థులు ఒక్కొక్కటికి 105 రూపాయలు లెక్కన చెల్లించి చేర్పించారని విని ఆశ్చర్యపోయాను. అసలు చిన్నపాటి కుల సంస్థ ఎన్నికకు ఈ హంగామా ఏమిటని అడిగితే ఈ ఎన్నికలలో గెలిచిన వారి సలహా పైనే ప్రభుత్వం వైశ్య ధర్మసంస్థలకు ట్రస్టీలను నియమిస్తుందట. ఎన్నికల ప్రహసనం పేరిట సంఘం అభాసు పాలవకుండా పెద్దలు జోక్యం చేసుకొని మరోసారి ఇలా జరక్కుండా చూడవలసివుంది.

- కె. బలరామయ్య

నెల్లూరు.

## సమన్వయ కర్త సత్య సాయిబాబానా?

డిసెంబర్ 4తేది 'జమీన్‌రైతు' పత్రిక 'జనవాణి' శీర్షికలో శ్రీవాస్తు

రామచంద్రగారు పుట్టపర్తి సత్యసాయిబాబాను అయోధ్య సమస్యకు సయోధ్య ... మహావ్యక్తిగా అభివర్ణించారు ... బాబా వంటి ఇంద్రజాలికుడు సయోధ్య సమస్యను పరిష్కరించలేరని బహుశా ఆయన ఈపాటికి గ్రహించి వుంటారనుకుంటాను. బిజెపి అయోధ్య విషయమై హత్యా రాజకీయాలకు దిగితే సాయిబాబా ప్రజల మూర్ఖత్వాన్ని సొమ్ముచేసుకుంటున్నారు. సమాచార శాఖ ... వీడియో టేపులు గనుక టివిలో ప్రసారం అయివుంటే సాయిబాబా హస్తలాఘవాన్ని చూచిన అతని భక్తులే పుట్టపర్తిని అయోధ్య చేసివుండేవారు. పాకీవాడి నుండి ప్రధానమంత్రి వరకు ప్రతి వ్యక్తికీ గొప్పతనం ఆపాదించిపెట్టి భగవంతునిగా పూజిస్తే మందిర్- మసీదు సమస్యలు రూపుమాసి పోతాయని భావించడం, భ్రమఅనే విషయం గ్రహించాలి.

-టి. రవీంద్ర

గుంటూరు.

## అరుదైన వ్యక్తి రామచంద్రారెడ్డి

డిసెంబర్ 17 తేది పరమ పదించిన ఇందుకూరుపేట మాజీ మండలాధ్యక్షుడు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిని అరుదైన వ్యక్తిగా అభివర్ణించవచ్చు. పేరెన్నిక గన్న భూస్వామ్య కుటుంబంలో పుట్టినా పేదప్రజల పట్ల ఆయన చూపే ఆప్యాయత, ఆదరణ మరువలేము. ఈ నాటి రొచ్చు రాజకీయాల్లో సుగంధపరిమళాలు వెదజల్లే తులసి మొక్క వంటివారు శ్రీ రెడ్డి. పిల్లలపట్ల ఆయన చూపే ప్రేమ జిల్లాలో మరెవ్వరూ చూపించలేరు. అపూర్వ లక్షణాలు పుణికి పుచ్చుకొన్న అరుదైన వ్యక్తిగా శ్రీ రామచంద్రారెడ్డి గారిని నిస్సందేహంగా చెప్పవచ్చు.

- కె.రామసుబ్బారెడ్డి.

రాముడుపాలెం.

## పి.వి.చర్యలు ప్రశంసనీయం

అయోధ్య పరిణామాలపై ఈనెల 11తేది జమీన్‌రైతు సంపాదకీయం వాస్తవాలకు దర్పణం పడుతోంది. బాబ్రీ మసీదు విధ్వంసం సమకాలీన భారత రాజకీయ చిత్రపటంపై ఒక కళంకంగా మిగిలిపోతుందనే విషయం నిర్వివాదాంశం. సెక్యులర్ భావాలు కలిగిన ప్రతిహిందువూ లజ్జాభారంతో శిరస్సును అవనతం చేసుకోవలసిన దురదృష్టకర పరిణామం. గాయపడిన మైనారిటీల మనోభావాలకు ఊరట కలిగించి, మత విద్వేషాగ్ని కీలల్ని అదుపుదానికి సామరస్య సాధనకు పివి ప్రభుత్వం శ్రీవెంచవ లేకుండా కృషి చేయడం, అభినందనీయం అయితే నేషనల్-ఫ్రంట్-లెఫ్ట్ కూటమి అవకాశవాదవైఖరి, రెండు నాల్కల ధోరణి ఆశ్చర్యం, ఏవగింపు కలిగిస్తున్నఅంశాలు. బిజెపి విషయంలో ఇంకా కరకుగా కఠినంగా దృఢంగా వ్యవహరించలేదని వీరి గగ్గోలు. అయితే ఇంత వరకూ పివిప్రభుత్వం, మైనారిటీలో అభద్రతా భావనను నిర్మూలించి, ఆత్మవిశ్వాసం పెంపొందించడానికి తీసుకొన్న చర్యలు నిస్సందేహంగా ప్రశంసార్హమైనవి. మసీదు కూల్చివేతకు ప్రత్యక్ష పరోక్ష సహకారాన్ని అందించిన కల్యాణ్ సింగ్ ప్రభుత్వాన్ని రద్దుచేయడం, బిజెపి నాయకులు శ్రీ అద్వానీ, శ్రీ మురళిమనోహర్ జోషిల అరెస్టు, భజరంగ్‌దళ్, విశ్వహిందూ పరిషత్‌ల వంటి హిందూ అతివాద సంస్థలపై నిషేధాస్త్రం, మూడు రాష్ట్రాల బిజెపి ప్రభుత్వాల రద్దు, ధ్వంసం చేయబడిన మసీదు పునర్నిర్మాణానికి హామీ మొదలగు సత్వర సమయోచిత నిర్ణయాలు మైనారిటీల ప్రశంసలు చూరగొన్నాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

పివిఎల్ మాధవరావు

నెల్లూరు.

## 50 ఏళ్ళు

(3 పేజీ కొరవ)

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు పుట్టికి రు | 117-8-0 |
| రాగులు | 185-00 |
| జొన్నలు | 25-00 |
| సజ్జలు | 190-00 |
| మొలగొలుకు బియ్యం(కలిత)రూ.1-కి 4 శేర్లు | |

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

గోస్వామి పాత్రను ప్రతిభావంతంగా పోషిస్తే, రోజాగా నూతన నటి మధుబాల చలాకీగా నటించింది. పంకజ్‌కపూర్ విలనీయం బాగుంది.

మానవతా సిద్ధాంతాన్ని ప్రబోధించి కాశ్మీర్ తీవ్రవాదుల మనసు మార్చేయవచ్చున్న మణిరత్నం వాదన ఎంత వరకు సరిపోతుందన్న విషయాన్ని పక్కన బెడితే, దర్శక ప్రతిభ ప్రతి సన్నివేశంలో కన్పించే రసరమ్య చిత్రం రోజా.

## సినిమా

(9 పేజీ కొరవ)

దివ్యభారతి, పూజాబేడి, జగ్గయ్య బ్రహ్మానందం, బాబూమోహన్, కోట శ్రీనివాస రావు, వై. విజయ పాత్రధారులు. సమర్పణ. సుష్మా.

## విపరీతమైన తెలివి తేటలు గల తార

దక్షిణ భారతంలో పబ్లిసిటీ విషయంలో తన తర్వాతే మరెవరైనా అని నిరూపించింది ఖుష్బూ. ఈ ముస్లిమ్ ... కొట్టు పెట్టుకుంటుంది. ... వినాయకుడి విగ్రహాన్ని ఉంచుకుంది. మరో వైపు ఏసుక్రీస్తు విగ్రహం కూడా ఉంది. "సర్వమత సామరస్యానికి ప్రతీక మా ఇల్లు" అని సగర్వంగా చెప్పుకుంటుంది.



తన వియ్యంకుడు, మంచివాడు,
బెజవాడ రామచంద్రారెడ్డి గారిని
కోల్పోయినందుకు
మాకు అత్యంత ఆప్తుడు,
మా అభివృద్ధి కారకుడు గుండ్రా జనార్ధన రెడ్డి గార్కి
తండ్రిని కోల్పోయిన బెజవాడ వెంకట్రామ్‌రెడ్డి గార్కి
వారి కుటుంబానికి మా సానుభూతి

**లతా బాలకృష్ణన్**

రాధా—మాధవ్, నర్తకి థియేటర్స్ క్యాంటీన్లు, నెల్లూరు

జననం: 17-8-1908 మరణం: 31-12-1987

మా తండ్రి
**భీమవరపు సుబ్బరాయులు నాయుడు గారు**
స్వర్గస్థులై ఐదు సంవత్సరాలు గడచింది.
వారి స్మృతులను అనుదినం
మా హృదయాలలో నంస్మరిస్తూ
**భీమవరపు వెంకయ్యనాయుడు**
**భీమవరపు ఆదిశేషయ్యనాయుడు**
స్టేట్ కో ఆపరేటివ్ బ్యాంకు (రిటైర్డ్), హైదరాబాద్
మరియు కుటుంబసభ్యులు

# ✣ నివాళి ✣



ఇందుకూరుపేట మండల మాజీ అధ్యక్షుడు

మా అభివృద్ధికి కారకుడు, సౌమ్యుడు, మృదు స్వభావి, మా తండ్రి

## శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి గారు

మమ్ము దుఃఖసాగరమున ముంచి

**17.12.1992** తేది గురువారం స్వర్గస్తులైనారు

వారులేని లోటు ఎవరూ తీర్చలేనిది. వారి దివ్యస్మృతులను

అనుదినం స్మరించుకొంటూ, వారికి నివాళి సమర్పిస్తున్నాము.

| ఉత్తరక్రియలు |
|---|
| **25.12.92** తేది శుక్రవారం శిలాప్రతిష్ఠ |
| **26.12.92** తేది శనివారం శిలోద్వాసన |

కుడితిపాళెంలోని మా స్వగృహమున జరుగును.

కావున బంధుమిత్రులు తెలియగోరుతాము.

- బెజవాడ వెంకట్రామిరెడ్డి, సుధేష్ కుమార్ రెడ్డి

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt